శ్రీమతే రామానుజాయ నమః



తిరుమఙ్గైయాఴ్వార్ అనుగ్రహించిన

# తిరువెఴుకూఱ్ఱిరుక్కై-సవ్యాఖ్యానము

(పెరియవాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్య, అరుంబదము,

తెలుగు అనువాదంతో)

అనువక్త

డా॥ శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యులు

2014

తిరుమఙ్గైయాళ్వార్ అనుగ్రహించిన
తిరువెళుకూత్తిరుక్కై - సవ్యాఖ్యానము
(పెరియవాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్య, అరుంబదము, తెలుగు అనువాదంతో)

అనువక్త - డా॥ శ్రీమాన్. ఈ.ఏ. శింగరాచార్యులు
ద్వితీయ ముద్రణము - డిసెంబరు, 2014
సందర్భము :
ఆవిష్కరణము : 12-12-2014
ప్రతులు : 500

ముఖచిత్రం- ఆరావముదాళ్వార్ (తిరుక్కుడన్దై)

(ఈ గ్రంథము శ్రీ తూపురాణి నరసింహాచార్య స్వామివారి (రామదుగు) పరమపదోత్సవ సందర్భంలో వారి దివ్యస్మృతి చిహ్నికా రూపంగా ముద్రింపబడుతున్నది.)

ప్రతులకు

అక్షరయోజనము
అన్నపూర్ణ గ్రాఫిక్స్
53/4, ఆర్.ఎస్. గార్డెన్స్
తిరుపతి. ఫోన్-0877-2235006



# ముఖబంధం

కలయామి కలిధ్వంసం కవిం లోకదివాకరమ్ ।
యస్య గోభిః ప్రకాశాభీ రావిద్యం నిహతం తమః ॥

**"వేదమ్ తమిళ్ శెయ్ద మాఱన్"** అని కీర్తింపబడే రీతిలో నమ్మాళ్వార్లు నాల్గువేదాల సారాన్ని నాల్గు దివ్యప్రబంధాలుగా ద్రావిడీకరించారని పూర్వాచార్యుల నిర్వాహం. ఆ నాల్గు ద్రావిడ ప్రబంధాలు నాల్గు ద్రావిడ వేదాలుగాకూడా శ్రీ వైష్ణవ సంప్రదాయంలో చెప్పబడుతున్నాయి. ఈనాల్గు వేదాలకు **"ఆఱఙ్గమ్ కూఱ అవతరిత్త"** అని అంటూ శ్రీవరవరమునులు అనుగ్రహించిన రీతిలో ఆఱు వేదాంగాలుగా చెప్పతగిన ఆఱు ప్రబంధాలను ప్రసాదించినవారు తిరుమఙ్గైయాళ్వార్లు. అందువల్లనే "షట్ప్రబంధ ప్రణేతారమ్" అని వీరు కీర్తింపబడ్డారు. ఆటింటిలో ప్రకృతప్రబంధం అయిన తిరువెళుకూత్తిరుక్కై వరుసలో మూడవది. వేదార్థాలను వేదాంగాలు విశదీకరించినట్లే, నమ్మాళ్వార్లు తమ ప్రబంధాలలో చెప్పిన అర్థాలనే తిరుమఙ్గైయాళ్వార్లు తమ ప్రబంధాలలో విశదీకరించారు. అందువల్లనే వీరి ప్రబంధాలు నమ్మాళ్వార్ల ప్రబంధాలకు అంగాలుగా చెప్పబడ్డాయి, వాటిలో, నమ్మాళ్వార్లు అనుగ్రహించిన ఏ అర్థాన్ని, అంటే, ఏ దశకంలో చెప్పిన అర్థాన్ని తిరుమఙ్గైమన్నన్ ఈ తిరువెళుకూత్తిరుక్కైలో ఏ రీతిలో విశదంచేశారు? అనే ప్రశ్న ప్రకృతంలో కలుగుతుంది. దీనికి సమాధానం సంగ్రహంగా నివేదింపబడుతున్నది.

స్వస్వరూప-పరస్వరూప-ఉపాయ-ఫల-విరోధులనే అర్థపంచకాన్ని వివరించే ద్రావిడవేదాలైన నమ్మాళ్వార్ల ప్రబంధాలలో **"నోత్త నోన్బు"** (తిరు.5-7) నుండిగల నాల్గు దశకాల్లోను, **"ఉలకముణ్డ పెరువాయా"** (6-10) అనే దశకంలోను వివరింపబడే ఉపాయస్వరూపం అనే పరమార్థమే ఇందులోకూడా తెలుపబడింది. అందులోను సంగ్రహంగా **"ఆరావముదే"** (5-8) అనే దశకంలో చెప్పబడే అర్థాన్ని ఈ ప్రబంధంలో తిరుమఙ్గైయాళ్వార్లు విశదీకరించారు అన్నది ముందు ప్రస్తావించిన ప్రశ్నకు క్లుప్తమైన సమాధానం. ఇది కొంచెం వివరించబడుతున్నది.

"శ్రియఃపతి శ్రీపాదాలలో ఆ స్వామి ఆనందంకోసమే చేయబడే కైంకర్యమే పరమపురుషార్థం. దాన్ని పొందడానికి ఉపాయంగా మన చేతిలో అణుమాత్రంకూడా ఏమీ లేదు. నిర్హేతుకకృపనుకల అతడొక్కడే ఉపాయం" - అన్నది సకలవేదశాస్త్ర ఇతిహాస పురాణాలలోను, ఆళ్వార్ల దివ్యప్రబంధాలలోను నిశితంగా పరిశీలిస్తే కన్పించే సారతమం

అయిన పరమార్థం, ఈ అర్థజ్ఞానాన్ని కలవారే నిజమైన ప్రపన్నులు. అనాదిగా అలవాటు పడిన స్వాతంత్ర్యమనే తగని మనఃప్రవృత్తిచేతను, దీనివల్ల ఏర్పడ్డ స్వప్రవృత్తిపరత అనే తన ప్రయత్నంలోని  అభినివేశంచేతను కొందరు భ్రమలో కూరుకొనిపోయి ఉంటారు, వారిలో కొందఱు పరమపదంలో భగవానుని అనుభవించడం వల్ల, ఇంకా కొందఱు ఆ స్వామికి కైంకర్యం చేయడంవల్ల తమకు ఏర్పడే ఆనందాన్ని ఉద్దేశ్యంగా భ్రమిస్తారు. ఆ ఆనందానికి ఉపాయంగా తాము అనుష్ఠించే భక్తి మొదలైనవానిని ముందు పేర్కొన్నవారు, శరణాగతి అనే పరగత స్వీకారాన్ని తరువాత పేర్కొన్నవారు ఉపాయంగా భ్రమిస్తారు. అటువంటివారికికల ఈ భ్రమను తీర్చడంకోసం భగవానుడు కఠిననియమాలతోను, ఈ జీవాత్మయొక్క అత్యంతపారతంత్ర్యం అనే స్వరూపంయొక్క అనుసంధానంతోను కూడినది, వేదాంతసిద్ధాంతం అయిన భక్తియోగాన్ని, న్యాసవిద్య అనే ఉపాయప్రవృత్తిని క్రమంగా వారికి ఉపదేశించాడు, ముందు తెల్పిన అనాదివాసనవల్లనే పై క్రమానుసారంగా ఆ స్వార్థభగవదనుభవంలోనో, స్వార్థభగవత్కైంకర్యంలోనో వారికిగల అభినివేశం మాఱకపోయినట్లయితే,వారి ఉద్దేశ్యం ప్రకారం తత్క్రతున్యాయానుసారంగా పరమపదంలోకాకుండా వారికి ఆ ఫలాన్నే స్వామి అనుగ్రహిస్తాడు. స్వాత్మానుభవాన్నే కోరే కైవల్యార్థులవలెనే, నిరతిశయపురుషార్థం అయిన పరార్థానుభవకైంకర్యాలను వారు పొందలేరు, “తాము అనుష్ఠించే దేనిలో అయినా ఉపాయత్వలేశగంధ ప్రసక్తి లేదు. నిర్హేతుకకృపతోకూడిన శ్రియఃపతి ఒక్కడు మాత్రమే మోక్షోపాయం” అనే వాస్తవాన్ని తెలిసినవారై, పరార్థకైంకర్యంలో తమకుగల రుచిని తెలుపడం కోసం తాము శరణాగతిని ఆచరించే సమయంలోనే ఆ స్వీకారం భగవత్కృషి ఫలమే తప్ప, ఉపాయం కాదు అని అనుసంధించేవారై, ఈ కారణంచేతనే సిద్ధోపాయనిష్ఠులు అని, పరగతస్వీకారనిష్ఠులు అని ప్రశంసింపబడే మహనీయులైన ప్రపన్నులే భగవానునినిర్హేతుక కృపవల్ల మాత్రమే పరార్థకైంకర్యమనే  ఆ పరమప్రాప్యాన్ని పొందుతారు- అనే దివ్యమైన అర్థాన్ని ఆఴ్వార్ల దివ్యప్రబంధాలనే పాలసముద్రాన్ని మథించి శ్రీపిళ్ళైలోకాచార్యులవారు శ్రీవచనభూషణమనే దివ్యశాస్రంలో సారంగా అనుగ్రహించిన అమృతం. ఈ అర్థాన్నే నమ్మాఴ్వార్లు ఇంతకు ముందు పేర్కొన్న తిరువాయ్‌మొఴిలోని అయిదవ దశకంలో అనుగ్రహించారు, ఈ అర్థాన్నే ప్రకృతప్రబంధం అయిన తిరువెఴుకూఱ్ఱిరుక్కైలో తిరుమఙ్గైమన్నన్ విశదంచేశారు- అనే విషయం పూర్వాచార్యవ్యాఖ్యానాల రసాన్ని అనుభవించేవారికి సులభంగా అర్థమవుతుంది. ఈ అయిదు దశకాలలో సంగ్రహంగా ఆరావముదాఴ్వార్లను గూర్చిన “ఆరావముదే” (5-8)



అనే దశకంలో వివరంగా ప్రస్తావింపబడ్డ అర్థాన్ని తెలుపుతున్నది- ఆ ఆరావముదాఴ్వార్లను ఉద్దేశించిన ఈతిరువెఴుకూఱ్ఱిరుక్కై. ఈ అంశం ప్రస్తుతప్రబంధాన్ని, ఆ దశకాన్ని చేర్చి అనుసంధించేవారికి చాలా సులభంగానే తెలుస్తుంది.

**“ఒరు పేరున్ది”** అని ప్రారంభించి, **“అయనై ఈన్ఱనై”, “వాళియిన్ అట్టనై” “మూవులకళన్దనై, “అరన్దైయై తీర్‌త్తనై”, “ఏఴలకు ఎయిఱ్ఱిల్ కొణ్డనై”, “అఱు శువై ప్పయనుమాయినై”, “ఐమ్బుదై అఙ్గైయుళ్ అమర్‌న్దనై”, “అతితుయిల్ అమర్‌న్దనై”, “వరుణముమ్ ఆయినై”,  “పూతముమ్ నీయే”, “ఏఴ్విడై శెఱ్ఱినై”, “అఱివరు నిలైయినై”, “ఐమ్బాలోదియ ఆకత్తిరుత్తినై”, “అఱుముదల్........విరిన్దు నిన్ఱనై”**, అని అంటూ చేతనుని పొందాలని అనాదికాలంగా పలు రీతుల్లో కృషి చేసే భగవానుని విషయంలోనే ఉపాయత్వం పరిపూర్ణంగా ఉండడాన్ని, జీవుని చేతిలో ఏమీ లేకపోవడాన్ని చూపిస్తూ **“మాఱ్ఱో వినైయే**” అని నిర్హేతుకకృపతో అతడే సంసారసంబంధాన్ని ఛేదించి అనుగ్రహించాలని అంటూ ఆ స్వామి శ్రీపాదాలనే దానికి శరణంగా నిశ్చయించుకోవడాన్ని తెలిపే ఈ ప్రబంధం ఉపాయస్వరూపాన్ని విశదీకరిస్తున్న రీతిలో వేఱొక ఏ ప్రబంధం తెలుపడం లేదుకదా! ఇది ఈప్రబంధంలో ప్రతిపాదితమైన అర్థవైలక్షణ్యం అని గ్రహించాలి.

ఇక శబ్దాలంకారప్రక్రియలో ఈ ప్రబంధం కూర్పబడిందన్నది దీన్ని గమనించిన వారికి సులభంగా గోచరిస్తుంది. ఒకటినుండి ఏడువరకుగల అంకెలను ఆరోహణ, అవరోహణక్రమంలో అర్థంద్వారా సంకేతాత్మకంగా పేర్చడంవల్ల ఇది “**ఎఴుకూఱ్ఱిరుక్కై**” అనే పేరునుకల చిత్రబంధప్రకారంలోకి చేరుతుంది, ఇది రథబంధం. మూలకోశాలలో చిత్రంతోసహా ఈ బంధం చూపబడింది. మహావిద్వాన్ కాంచీ ప్ర.భ. అణ్ణాస్వామివారు కూడా దీన్ని చూపించారు.

**“శిఱు మామనిశర్”** అని అన్నరీతిలో ఆకారంలో చిన్నది అయినా అర్థవైలక్ష్యణాన్ని బట్టి, సన్నివేశవైచిత్రినిబట్టి చాలా మహనీయమైన ఈ ప్రబంధానికి నాలాయిరదివ్యప్రబంధ వాఙ్మయాన్ని పూర్తిగా వ్యాఖ్యానించిన, పరమకారుణికులు శ్రీ పెరియవాచ్చాన్ పిళ్ళై అనుగ్రహించిన పరమరసఘనాలు అయిన వ్యాఖ్యలు రెండున్నవి. మొదటివ్యాఖ్యానాన్ని అనుగ్రహించిన తరువాత వేంచేసిన (మెనక్కిట్ట) శ్రీ వైష్ణవులకు రెండవవ్యాఖ్య కృపజేసినట్లు తెలుస్తున్నది. పెరియవాచ్చాన్‌పిళ్ళై తప్ప, పూర్వాచార్యులు వేఱెవ్వరు దీన్ని వ్యాఖ్యానించినట్లు కన్పించదు. సుమారు నూరు సంవత్సరాలకు ముందు ఈ రెండు వ్యాఖ్యలు,

వీటికి పూర్వులు అనుగ్రహించిన చాలా క్లుప్తమైన అరుంబదంతో పాటు ముద్రింపబడినా, ఆ కోశాలు ఇపుడు దుర్లభాలు. దొరికినా ఉపయోగపడని రీతిలో శిథిలాలు, త్రుటి తాలును. అందువల్ల మిగిలిన నాలాయిర దివ్యప్రబంధ వ్యాఖ్యాలవలేనే వీటినికూడా పునర్ముద్రించవలసిన ఆవశ్యకత ఎంతయినా ఉన్నది.

ఈ గ్రంథం 2007వ సంవత్సరంలో విజయవాడ వాస్తవ్యులు, ఉ.వే. శ్రీమాన్ తూపురాణి ఉడైయవర్లు స్వామివారి పురుషకారంతో, వారి శిష్యులు అందించిన ఆర్థిక ప్రోత్సాహంతో తిరువెళుకూత్తిరుక్కై ప్రబంధానికి గల పెరియవాచ్చాన్‌పిళ్ళై మణిప్రవాళ వ్యాఖ్య, అరుంబదవివరణం, వ్యాఖ్యకు ఆంధ్రానువాదం, కాంచీ మహావిద్వాన్, శ్రీమాన్ ప్ర.భ. అణ్ణంగరాచార్యస్వామివారి దివ్యార్థదీపికా అనే ద్రావిడ వ్యాఖ్యానం, దాని ఆంధ్రానువాదం ముద్రింపబడ్డాయి. ప్రస్తుతం మళ్ళీ కరీంనగర్ వాస్తవ్యులు ఉ.వే. శ్రీమాన్ తూపురాణి రంగాచార్య స్వామివారి ఆజ్ఞానుసారం వారి పితృపాదులైన **ఉ.వే. శ్రీమాన్ నరసింహాచార్య స్వామివారి (రామదుగు) పరమపదోత్సవ స్మృతిచిహ్నంగా** ఈ గ్రంథం ముద్రింపబడడం చాలా ఆనందకరమైన విషయం. ఇందులో అణ్ణంగరాచార్య స్వామివారి వ్యాఖ్యలోని అవతారికకు అనువాదం మాత్రం పాఠకుల సౌకర్యార్థం ముద్రింపబడుతున్నది. మిగిలిన దివ్యార్థదీపిక వ్యాఖ్యాన భాగం, దాని అనువాదం చేర్చబడలేదు.

ఈ గ్రంథం తిరిగి ముద్రించగోరిన **శ్రీమాన్ తూపురాణి రంగాచార్య స్వామివారు** నాపట్ల చూపే ఆదరణకు నేను ఎంతో కృతజ్ఞుడను. అదేవిధంగా, ఈ ప్రయత్నంలో తగిన ప్రోత్సాహాన్ని అందించిన **మిత్రమణి, సహృదయులు ఉ.వే. శ్రీమాన్ సముద్రాల శఠకోపాచార్య స్వామివారి** పట్లకూడా నేను కృతజ్ఞుడను. వీరిరువురి సన్నిధిలో సప్రశ్రయంగా నమస్సుమాంజలులను సమర్పించు కొంటున్నాను. నా అనువాదంలోని దోషాలను సహించవలసినదిగా సహృదయ పాఠకులను ప్రార్థిస్తూ, పూర్వం వలె ఈ గ్రంథం ప్రపన్నులకు ఆనందాన్ని కలిగించగలదని నమ్ముతున్నాను. స్వస్తి.

**రథబంధప్రబంధోఽయం కలిద్విట్సూరిణేరితః ।**
**శ్రీకృష్ణసూరిగురుభిః వ్యాకృతో మధురోత్తరమ్ ॥**

**తద్వ్యాఖ్యా మనుసృత్యైషః శింగరార్యో యథామతి ।**
**సంఖ్యావతాం ప్రమోదాయ వివృణోత్యాంధ్రభాషయా ॥**

తిరుపతి
04-12-2014.

ఇట్లు
భాగవత విధేయుడు
**ఈ.ఏ. శింగరాచార్యులు**



## కాంచీమహావిద్వాన్ శ్రీమాన్ ప్ర.భ. అణ్ణంగరాచార్యస్వామివారి
## అవతారికకు ఆంధ్రానువాదం

**"తిరువెఴుకూఱ్ఱిరుక్కై"** అనే ఈ దివ్యప్రబంధం ఈ లోకంలోని అజ్ఞానం తొలగడంకోసం అవతరించి, అందమైన తమిళంతో చక్కని ప్రబంధాలను అనుగ్రహించిన ఆఴ్వార్లలో ప్రధానులైన నమ్మాఴ్వార్లు అనుగ్రహించిన, చతుర్వేదసారాలు అయిన నాల్గు దివ్యప్రబంధాలకు ఆఱు అంగాలు అనుగ్రహించడంకోసం అవతరించిన తిరుమఙ్గైయాఴ్వార్లు కృపజేసిన ఆఱు దివ్యప్రబంధాలలో ఒకటి. (పెరియ తిరుమొఴి, తిరుక్కుఱున్దాణ్డకమ్, తిరువెఴుకూఱ్ఱిరుక్కై, శిఱియ తిరుమడల్, పెరియ తిరుమడల్, తిరునెడున్దాణ్డకమ్-అనేవి ఆ ఆఱు దివ్యప్రబంధాలు) శ్రీమన్నాథమునులు విభాగించిన క్రమంలో మూడవ వేయి అయిన ఇయఱ్పాలో ఎనిమిదవ ప్రబంధంగా ఇది కూర్పబడింది.

విషయప్రవణులై తిరుగుతూ ఉండే ఈ ఆఴ్వార్లను సర్వేశ్వరుడు సంస్కరించి, వినియోగపఱచుకోదలచి, "లౌకిక విషయాలలో పూర్తిగా మునిగి తిరిగే వీరిని శాస్త్రాలను చూపించి, సంస్కరించడం సాధ్యం కాదు, నా అందాన్ని చూపించి మాత్రమే నివర్తింపజేయాలి" అని తలచి, తన సౌందర్యాన్ని చూపించగా, ఆఴ్వార్లుకూడా దానిని దర్శించి, దానిలో అభినివేశాన్ని పొంది, **"వేమ్బిన్ పుఴు వేమ్బన్ఱి యుణ్ణాదు, అడియేన్ నాన్ పిన్నుమ్ ఉన్ శేవడియన్ఱి నయవేన్"** (వేప చెట్టులోని పురుగు ఆ వేపను తప్ప వేఱొక దానిని తిననట్లు, నేను నీ అందమైన శ్రీచరణాలను తప్ప వేఱొక దానిని శరణంగా ఆశ్రయించను) అనే రీతిలో అవగాహించారు.

వీరు ఈ రీతిలో తన పట్ల ఆసక్తిని కల్గి ఉండడాన్ని చూచిన సర్వేశ్వరుడు "ఇపుడు నా విషయంలో వారికి ఉండే రాగం మిగిలిన విషయాలలోవలె కాకుండా, సంబంధ జ్ఞానపూర్వకంగా పోయినా పోవచ్చు" అని భావించి, అన్ని అర్థాలను తెలిపేది అయిన తిరుమంత్రాన్ని తన సౌశీల్యాదికల్యాణగుణాలను, తిరుమంత్రార్థానికి పర్యంతసీమ అయిన దివ్యదేశాలను ఆఴ్వార్లకు దర్శింపజేయగా, వారుకూడా **"వాడినేన్ వాడి"** అంటూ ప్రారంభించి, సర్వేశ్వరుడు అభిమానించిన దేశాలే పరమప్రాప్యమని అనుభవించారు.

ఈ విధంగా అనుభవించిన ఆఴ్వార్లకు ఈ అనుభవం నిత్యంగా కొనసాగడం కోసం వీరిని పరమపదానికి తీసికొనిపోవాలని తలచిన సర్వేశ్వరుడు సంసారంలో వీరికి జిహాస (వదలి పెట్టాలనే కోఱిక) కలిగేటట్లు దాని నైచ్యాన్ని తెలుపగా, (దానిని) తెలిసిన వీరు భయపడి వణకి, **"మాఱ్ఱుముళ"** అనే తిరుమొఴిలో **"ఇరుపాడెరికొళ్ళియినుళ్ ఎఱుమ్బేపోల్"** (రెండువైపులా మండే కట్టెలో ఉండే చీమలవలె), **"పామ్బోడొరు కూరైయిలే పయిన్ఱాఱ్పోల్"** (పాముతో కలసి ఒకే నివాసంలో ఉండే రీతిలో), **"వెళ్ళత్తిడైప్పట్ట**

**నరియినమ్ పోల్"** (ప్రవాహంలో చిక్కుకున్న నక్కల గుంపువలే) అని అంటూ తన భయానికి పలు దృష్టాంతాలను పల్కి ఆక్రోశించారు.

ఈ విధంగా వీరు ఎలుగెత్తి అఱచి, అఱచి, **"పణియా యెనక్కుయ్యుమ్ వకై పరఞ్జోతీ!"** (పరంజ్యోతీ! నేను తరించే రీతిని నాకు తెలుపు) అని, **"అన్దో! అడియేఱ్కరుళాయ్ ఉన్నరుళే"** (అయ్యో! దాసుడనైన నాపై నీ దయను చూపు) అని పల్కి వేడినాగాని, చిన్నపిల్లలు "ఆకలి, ఆకలి" అని అఱచి ఏడ్చినా , అజీర్ణం మొదలైనవి పోయి, నిజమైన ఆకలి కలిగేంతవరకు అన్నం పెట్టని తల్లివలె, భగవానుడు వీరికి పూర్తిగా పరిపక్వం అయిన పరమభక్తి కలిగేంతవరకు నేను వీరికి ముఖం చూపించను–అని ఉదాసీనుడై ఉండగా, ఒక క్షణం కూడా సర్వేశ్వరుణ్ణి విడిచి ఉండలేని ఆఴ్వార్లు, అతిశయించిన దాహాన్ని పొందినవారు నీటిలో పడి, నీటిని తాగడం, నీటిని చేతులారా తీసికొని పైన జల్లుకోవడం చేసేటట్లే, ఆ సర్వేశ్వరుణ్ణి నామంతో కీర్తించి, శిరస్సుతో ప్రణమిల్లి, మనస్సుతో భావించి ప్రాణధారణ చేయాలని చూచారు – తిరుక్కుఱున్దాణ్డకమ్ అనే దివ్యప్రబంధంలో

దాహం అంతులేకుండా ఉంటే, కొంచెంగా తాగిన చన్నీరు తృప్తిని కల్గించడం పోయి, ఇంకా ఇంకా అతిశయించిన దాహాన్ని కల్గించేటట్లే, వీరు తిరుక్కుఱున్దాణ్డకంలో అనుభవించిన అనుభవం ప్రాక్తనమైన అభినివేశాన్ని వృద్ధిచేసి, గొప్ప ఆర్తిని కల్గించగా, **"నిన్నడియిణై పణివన్ వరుమిడరకల మాఱ్ఱో వినైయే"** అని అంటూ ఆర్తులై శరణు వేడారు – ఈ తిరువెఴుకూఱ్ఱిరుక్కై అనే దివ్యప్రబంధంలో.

## "తిరువెఴుకూఱ్ఱిరుక్కై" అంటే ఏమి?

ఈ తిరుమఙ్గై యాఴ్వార్లు తమిళకవులలో ప్రముఖులు అన్నది లోకం తెలిసిన విషయం. ఆశుకవిత్వం అని, మధురకవిత్వం అని, చిత్రకవిత్వం అని, విస్తారకవిత్వం అని కవిత్వాలలో నాల్గు రీతులున్నాయి. శ్రమపడి పదాలను కూర్చి, గొప్ప ప్రయాసంతో పాడడం కాకుండా, పలు నియమాలతో కూడిన శ్లోకాలను శీఘ్రంగా పరవశంగా పాడడమనే ఆశుకవిత్వం, పదప్రయోగం, పదప్రయోగవికల్పంకూడి ఉండేటట్లు, శబ్దగాంభీర్యం, అర్థమాధుర్యం ప్రకాశించేటట్లు, పలు రీతులలో అలంకారాలు విలసిల్లేటట్లు కవిత్వం చెప్పడం– అనే మధురకవిత్వం, కలివెణ్బా మొదలైన వృత్తాలను విస్తరించి పాడడమనే విస్తారకవిత్వం ఈ ఆఴ్వార్ల దివ్యప్రబంధం అయిన పెరియ తిరుమొఴిలోను, తిరుత్తాణ్డకాలలోను, తిరుమడల్‌లలోను చక్కగా చూడవచ్చు.

ఇక, మిగిలినది చిత్రకవిత్వం. దీని రీతులు అనేకం **"ఏకపదముమ్, ఎఴుకూఱ్ఱిరుక్కైయుమ్, కాదై క్కరప్పుమ్ కరన్దురైచ్చెయ్యుళుమ్, కూడచ్చతుక్కముమ్, కోమూత్తిరిముమ్, ఇవై ముదలావన శిత్తిరక్కవియే"** అని, **"మాలైయాఱ్ఱే శక్కరఙ్ఙఴికళుమ్ ఏకపాదమ్ ఎఴుకూఱ్ఱిరుక్కై కాదైకరప్పే కరన్దుఱప్పాట్టే పాదమయక్కే పావిన్ పుణర్ప్పే, కూడశతుక్కమ్ కోమూత్తిరియే ఓరినత్తెఴుత్తాలుయర్న్దపాట్టే, ఒఱ్ఱుప్పెయర్త్తల్ ఒరుపొరుట్పాట్టే శిత్తిరప్పావే విశిత్తిరప్పావే వికఱ్పనడైయే వినా వుత్తరమే, శరుప్పతోపత్తిరమ్ శార్న్ద వెఴుత్తే, ఉదారణనోక్కి, విరిత్తు మఱైత్తుమ్ మిఱైక్కవిప్పాట్టుమ్, తెరిన్దుప్పాడువదు శిత్తిరక్కవియే"** అని అంటూ లక్షణగ్రంథాలలో ఆ ప్రకారాలు లక్షింపబడ్డాయి. అందువల్ల **"ఎఴుకూఱ్ఱిరుక్కై"** అనేది చిత్రకవిత్వాంతర్గతం.

ఛత్రబంధం, పద్మబంధం, మురజబంధం, నాగబంధం, రథబంధం–అని సంస్కృత కవులు కవనం చేసినట్లే, తమిళకవులును చేయడం కద్దు. వీని లక్షణాలు లక్షణ గ్రంథాల్లో నిర్వచింపబడ్డాయి– సంస్కృతంలో శిశుపాలవధమహాకావ్యం, యమకరత్నాకరం, పాదుకాసహస్రం, లక్ష్మీసహస్రం, ప్రతాపరుద్రీయం మొదలైన గ్రంథాల్లో పలు బంధాలు విచిత్రంగా శ్లోకరూపంలో కవనం చేయబడినట్లే, తమిళంలోకూడా కొందఱు కవులు చిత్రకవిత్వాన్ని రచించారు. **"ఎఴుకూఱ్ఱిరుక్కై"** అన్నది రథబంధంలో కూర్చదగిన పాశురం. (రథమంటే తేరు) రథరూపం తోచేటట్లు గళ్ళను గీచి, వాటిలో సంఖ్యలప్రకారం పాశురభాగాలను అమర్చాలి. రథంలో పై భాగమని, క్రిందిభాగమని రెండు భాగాలను కల్గి ఉంటుంది. ఒక్కొక్క భాగంలోను ఏడు భాగాలుండేటట్లు గీయాలి. ఆ విధంగా గీచేటపుడు మొదటిభాగంలో (వరుసలో) మూడు గళ్ళు, రెండవ వరుసలో అయిదుగళ్ళు, మూడవ వరుసలో ఏడు గళ్ళు, నాల్గవ వరుసలో తొమ్మిదిగళ్ళు, అయిదవ వరుసలో పదకొండు గళ్ళు, ఆఱవరుసలో పదమూడుగళ్ళు, ఏడవవరుసలో కూడా ఆవిధంగానే పదమూడుగళ్ళు ఉండేటట్లుగా ఒకదానికి వేఱొకటి రెండుగళ్ళు ఎక్కువ ఉండేటట్లు క్రమంగా పెంచుతూ గీయాలి. పై భాగంలో తలనుండి, క్రింది భాగంలో పాదంనుండి ఈ క్రమాన్ని గ్రహించాలి. **"వీరశోఴియమ్"** మొదలైన లక్షణగ్రంథాల్లో దీని లక్షణం చాలా సంగ్రహంగా చెప్పబడింది.

నాలాయిర దివ్యప్రబంధం మూలం ముద్రణకోశాల్లో ఈ తిరువెఴుకూఱ్ఱిరుక్కై ప్రబంధానికి తగినట్లు రథబంధం అందంగా అచ్చువేయబడి, అనుబంధంగా ఇవ్వబడడం పలువురు గమనించే ఉంటారు. మేముకూడా ఇక్కడ సంగ్రహంగా బంధాన్ని వ్రాసి చూపాము.

రథం ఆకారం కన్పించేటట్లు, ఆ రథం పైభాగంలో ఏడు భాగాలు కన్పించేటట్లు, క్రింది భాగంలో ఆ రీతిలోనే ఏడు వరుసలు తోచేటట్లు, మొదటివరుసలో మూడు గళ్ళు, రెండవ వరుసలో అయిదు గళ్ళు ఈ విధంగా ఒకదాని కంటె వేఱొకటి రెండుగళ్ళు ఎక్కువ ఉండేటట్లు ఈ బంధం కూర్చబడి ఉండడం గమనించండి. ఇందులో లక్షణం

ప్రకారం సంఖ్యలను నింపి చూపి ఉన్నాము. ఈ అంకెలను అర్థశక్తితో గాని, శబ్దశక్తితోకాని గుర్తుకు తెచ్చేపదాలు తిరువెఴుకూఱ్ఱిరుక్కై ప్రబంధంలో కూర్చబడ్డాయి. మొదట సూచించిన బంధంలో అంకెలు నింపబడి ఉన్న క్రమంలోనే ఆయా భాగాల్లో ఆయా అంకెలను సూచించే పదాలను కల వాక్యాలను నింపాలి. ఆ విధంగా నింపి చూపిన బంధం కూడా ఇందులో చేర్చబడి ఉన్నది. ఈ విధంగా కవనం చేయడంలో ఏమి వైచిత్రి ఉన్నది? అని అంటే, పలు విచిత్రాలున్నాయి. వాటిని అన్నిటిని ఇక్కడ వివరంగా వ్రాయడం ప్రారంభిస్తే చాలా విస్తృతి అవుతుంది. సామాన్యబుద్ధిమంతులకుకూడా తమకు తామే జాగ్రత్తగా పరిశీలిస్తే అన్ని విచిత్రాలు చక్కగా తెలుస్తాయి. లేకపోతే, తెలిసిన వారిని అడిగి తెలిసికోవచ్చు. 1,2,3,4,5,6,7 అంకెలు తేరును చుట్టి ఒకదాని వెంట వేరొకటిగా మాలారూపంలో అమరి ఉండడం ఇందులో ఒక ముఖ్యమైన అందం. ఈ సంఖ్యాక్రమంలోనే పదాలను అమర్చేటట్లు, అర్థమాధుర్యం ఉండేటట్లు కూర్చడం చాలా సమర్థత.

ఈ ప్రబంధంలో కొన్నిచోట్ల సంఖ్యలను వాచకాలైన పదాలు లేకుండానే, స్మారకాలైన పదాలున్నా దోషంలేదు. అంటే **"ఒరు పేరున్ది ఇరుమలర్ త్తవిశిల్"** అనే చోట **'ఇరు'** అనే పదం రెండు అనే అంకెకు (సాక్షాత్తుగా) వాచకం కాకుండా గొప్పతనమనే అర్థాన్ని ఇస్తూ, శబ్దం శక్తిద్వారా మాత్రమే అంకెను స్మరింపజేస్తున్నది. ఈ రీతిలో, **"ఒన్దియ, అఞ్జియ, నాల్ వాయ్, ఇరునీర్, ఒన్ఱి, ఆఱు పొది"** అనే చోట్లకూడా గమనించ తగినవి. అర్థశక్తితోనే సంఖ్యలను సూచించాలనే నియమంలేదు. శబ్దశక్తితోను చూపవచ్చు. సంస్కృతభాషలోకూడా ఈ క్రమం ఉన్నది. ఒక సందర్భాన్ని చూపిస్తాము. శ్రీసుదర్శన శతకంలో **(ఏకం లోకస్య చక్షుః)** 1,2,3,4,5,6,7,8,9,10,100,1000 అనే అంకెలను సూచించే క్రమంగా పదాలను కూర్చేటపుడు తొమ్మిది అనే స్థానంలో ప్రయోగింపబడ్డ **"నవ"** అనే పదం అక్కడ ఆ సంఖ్యకు వాచకంకాకుండా నూతనమనే అర్థంలో రావడంకూడా గమనించండి.

సర్వేశ్వరుని స్వరూపరూపగుణవిభూత్యాదులను విశదంగా అనుభవించి, ఆ అనుభవం లోపల ఇముడలేక, బహిర్గతాలైన శ్రీసూక్తులు అయిన దివ్యప్రబంధాలలో ఈ విధంగా లక్షణాలు క్రమం తప్పకుండా అమరి ఉండడం ఎటువంటిది? అని అంటే, దుఃఖంలోపల ఇముడలేక వాల్మీకిముని నోటినుండి వెలువడిన **"మా నిషాద ప్రతిష్ఠామ్"** అనే శ్లోకం వారి సంకల్పంతో కాకుండా, చతుర్ముఖుని ప్రసాదంతో లక్షణ దోషం ఏమీ లేకుండా అవతరించినట్లే, భగవానుని అనుగ్రహంలో ఈ విధమైన విచిత్రప్రబంధం అవతరించిందని. సామాన్యమైన బ్రహ్మ అనుగ్రహమే ఇంత చేసిందంటే, సాక్షాత్తు భగవానుని దయ ఎంత చేస్తుంది అనే విషయంలో నోఱు తెఱచే వీలు ఉన్నదా? అందువల్ల ఇది స్వప్రయత్నపూర్వకం అయిన ప్రబంధం కాదని తెలిసింది.



ఆఴ్వార్లలో తిరుమఙ్గై యాఴ్వార్లు ఒక్కరే ఈ రీతిలోని చిత్రకవిత్వాన్ని చెప్పారు. అనంతరకాలానికి చెందిన వారిలో తిరుక్కురుకైప్పెరుమాళ్ కవిరాయర్ అనే పరమపండిత భాగవతోత్తములు తాము రచించిన **"మాఱన్ అలఙ్కారమ్"** అనే గొప్ప గ్రంథంలోని శబ్దాలంకార ప్రకరణంలో (నమ్మాఴ్వార్ విషయంగా) ఒక ఎఴుకూఱ్ఱిరుక్కై రచించారు. **"ఒరుననిత్తికిరియినిరు విశు మ్బుఴుక్క త్తొరు ఞాన్తొరుపకలొడియా వుఴప్పిన్"** అని మొదలిడి, **"ఞానపూరణ శుకోదయ నావీఱ మాన పూదణ కురుకాపురివ రోదయ....కైమ్మాఱెన నీకైక్కొణ్డదువే"** అనే ముగించిన పాశురాన్ని చూడండి.

శైవసంప్రదాయాచార్యులలో ఒకరు అయిన తిరుఞానసంబంధర్ రచించిన తేవారప్రబంధంలోని దశకాల్లో ముదల్ తిరుముఱైలో ఒక ఎఴుకూఱ్ఱిరుక్కై ఉన్నది. **"ఓరురు వాయినై మానాఙ్గారత్తిరియల్ పాయొరు విణ్ ముదల్ పూతలమ్"**...అని ప్రారంభించి **"నిన్నై నినైయవల్లవరిల్లై నీణిలత్తే"** అని ముగింపబడింది. పదినోఱామ్ తిరుముఱైలో కూడా నక్కీరర్ పాడిన ఒక ఎఴుకూఱ్ఱిరుక్కై ఉన్నది. **"ఓరుదమ్బీరురు వాయినై"** అని ప్రారంభించి, **"పాదఙ్గన్నిఱ్పురవువన్ పణిన్దే"** అని ముగింపబడింది. అందువల్ల, శ్రీవైష్ణవసంప్రదాయంలో రెండు, శైవ సంప్రదాయంలో రెండు–అని నాల్గు ఎఴుకూఱ్ఱిరుక్కై ప్రబంధాలు ఇంతవరకు అవతరించినట్లు చూస్తున్నాము. ఇంకా ఉంటే గమనించవలసినది.

ముందు తెలిసినట్లే గీతలను గీచి, గళ్ళలో అంకెలను నింపాలి అనే నియమం లేకుండా, ఒక్కొక్క గడిలో ఒక్కొక్క అక్షరాన్ని నింపి, వైచిత్రిని కల్గించడం అనే వేఱు విధమైన రథబంధం కూడా ఉన్నది. మాఱన్ అలఙ్కారమ్ మొదలైన గ్రంథాల్లో దీన్నికూడా గమనించవచ్చు. అంకెలను నింపిన రథబంధమే ఎఴుకూఱ్ఱిరుక్కై అనబడుతుంది.

ఈ దివ్యప్రబంధంలో **"ఒరు పేరున్ది"** అని ప్రారంభించి, **"ఇరు వకై ప్పయనాయ్ ఒన్ఱాయ్ విరిన్దు నిన్ఱనై"** అని అన్నంతవరకు మాత్రమే గళ్ళలో నింపవలసి ఉన్నది. ఆ తర్వాత **"కున్ఱామదు మలర్చ్చోలై"** అని ప్రారంభించినవి స్తోత్రసమాప్తి. దాన్ని తేరు నడుమండపంలో కూర్చవచ్చు.

ఈ దివ్యప్రబంధం 46 పాదాలను కల ఒక **"ఆశిరియప్పా"** వృత్తం. ఒక్కొక్క పాదానికి నాల్గు గణాలతో......చివరలో 'ఏ' అనే స్వరంతో ముగిసేది **"ఆశిరియప్పా"**.

ఈ ఆశిరియప్పా **"నేరిశై ఆశిరియప్పా", "నిలై మణ్డిల వాశిరియప్పా"** మొదలైన నాల్గు రీతులను కల్గి ఉన్నది. అన్ని పాదాలు నాల్గు గణాలను కల్గి, చివరిపాదం మూడు గణాలను కల్గి ముగిసేది **"నేరిశై యాశిరియప్పా"**. అన్ని పాదాలు నాల్గు గణాలతోనే ముగిసేది **"నిరైమణ్డిల వాశిరియప్పా"**. ఈ ప్రబంధం అన్ని పాదాలు నాల్గు గణాలతో ముగియడంవల్ల **"నిలైమణ్డిల వాశిరియప్పా"** అయినది.

శ్రీమతే రామానుజాయ నమః



తిరుమజ్గైయాళ్వార్ అరుళియ

# తిరువెళుకూట్రిరుక్కై

ఎమ్బెరుమానార్ అరుళిచ్చెయ్‌త

తనియన్

వాళి పరకాలన్ వాళి కలికన్ఱి
వాళి కుఱైయలూర్ వాళ్‌వేన్దన్ - వాళియరో
మాయోనై వాళ్‌వాలియాల్ మన్దిరఙ్గొళ్ మఙ్గైయర్‌కోన్
తూయోన్ శుడర్‌మాన వేల్



ఒరు పేరున్ది యిరు మలర్‌త్తవిశిల్
ఒరు ముఱై యయనై యీన్ఱనై-ఒరు ముఱై
ఇరు శుడర్ మీదినిలయఙ్గా- ముమ్మది
ళిలఙ్గై ఇరుకాల్ వళైయ-ఒరు శిలై
యొన్ఱియ ఈరెయిఱ్ఱఴల్ వాయ్ వాళియిన్
అట్టనై- మూవడి నా నిలమ్ వేణ్డి
ముప్పురి నూలొడు మానురి యిలఙ్గు
మార్వినిన్ - ఇరు పిఱప్పొరు మాణాకి
ఒరు ముఱై యీరడి మూవులకళన్దనై
నాఱ్ఱిశై నడుఙ్గ వఞ్జిఱై ప్పుళవై
యేఱి- నాల్ వాయ్ ముమ్మద త్తిరుశెవి
ఒరు తని వేళత్తరన్దైయై - ఒరు నా
ళిరు నీర్ మడువుళ్ తీర్‌త్తనై-ముత్తీ
నాన్మఱై ఐవకై వేళ్వి-అఱుతొళి
లన్దణర్ వణఙ్గుమ్ తన్మైయై- ఐమ్పులన్
అకత్తినుళ్ శెఱుత్తు-నాన్గుడనడక్కి
ముక్కుణ త్తిరణ్డవై యకఱ్ఱి- ఒన్ఱినిల్
ఒన్ఱి నిన్ఱు ఆఙ్గిరు పిఱప్పఱుప్పోర్
అఱియుమ్ తన్మైయై-ముక్కణ్ నాఱ్ఱోళ్
ఐవాయరవొడు-ఆఱుపొది శడైయోన్
అఱివరున్దన్మై ప్పెరుమైయుళ్ నిన్ఱనై
ఏళులకెయిఱ్ఱినిలత్తొణ్డనై- కూఱియ
అఱు శువై ప్పయను మాయినై-శుడర్ విడుమ్
ఐమ్పడై అఙ్గైయుళమర్‌న్దనై- శున్దర
నాఱ్ఱోళ్ మున్నీర్ వణ్ణ- నిన్నీరడి
యొన్ఱియ మనత్తాల్- ఒరు మది ముకత్తు
మఙ్గైయరిరువరుమ్ మలరన-అఙ్గైయిన్
ముప్పొళుదుమ్ వరుడ అఱితుయిలమర్‌న్దనై
నెఱిముఱై నాల్ వకై వరుణముమాయినై
మేదకు మైమ్పెరుమ్ పూతముమ్ నీయే
అఱుపద మురలుమ్ కూన్దల్ కారణమ్
ఏళ్విడై యడఙ్గ చ్చెఱ్ఱనై-అఱువకై
చ్చమయము మఱివరునిలైయినై-ఐమ్పా
లోదియ ఆకత్తిరుత్తినై-అఱమ్ముదల్
నాన్గవైయాయ్ మూర్‌త్తి మూన్ఱాయ్
ఇరువకై ప్పయనా యొన్ఱాయ్ విరిన్దు
నిన్ఱనై-కున్ఱా మదు మలర్ చ్చోలై
వణ్‌కొడి ప్పడప్పై- వరు పునల్ పొన్ని

మామణి యలైక్కుమ్-శెన్నెలొణ్ కఴని
త్తికఴవన మడుత్త- కణ్పోర్ పురిశై
కనక మాళిగై-నిమిర్కొడి విశుమ్బిల్
ఇళమ్పెఱై తువక్కుమ్-శెల్వమ్ మల్కు తెన్
తిరుక్కుడన్దై-అన్దణర్ మన్దిరమొఴియుడన్
వణఙ్గ-ఆడరవమళియి లఱితుయిల్
అమర్న్ద పరమ-నిన్నడియిణై పణివన్
వరుమిడరకల మాఱ్ఱో వినైయే

కమ్బర్ ఇయఱ్ఱియ శాఱ్ఱు ప్పాడల్

(కంబకవి రచించిన సమాపన పాశురము)

ఇడఙ్కొణ్డ నెఞ్జత్తిణఙ్గి క్కిడప్పన ఎన్నుమ్ పొన్ని
త్తడఙ్కొణ్డ తామరైశూఴుమ్ మలర్న్ద తణ్పూఙ్కుడన్దై
విడఙ్కొణ్డ వెణ్పల్ కరున్దుత్తి శెఙ్కట్టఴలుమిఴ్ వాయ్
పడఙ్కొణ్డ పామ్బణై ప్పళ్ళికొణ్డాన్ తిరుప్పాదఙ్గళే.

తిరువెఴుకూఱ్ఱిరుక్కై ముఱ్ఱిఱ్ఱు

పెరియవాచ్చాన్పిళ్ళై తిరువడికళే శరణమ్.





శ్రీమతే రామానుజాయ నమః



తిరుమఙ్గైయాఴ్వార్ అనుగ్రహించిన

# తిరువెఴుకూఱ్ఱిరుక్కై

## ఎమ్బెరుమానార్ అరుళిచ్చెయ్త తనియన్

**వాఴి పరకాలన్ వాఴి కలికన్ఱి**
**వాఴి కుఱైయలూర్ వాఴ్వేన్దన్ - వాఴియరో**
**మాయోనై వాళ్వాలియాల్ మన్దిరఙ్గొళ్ మఙ్గైయర్కోన్**
**తూయోన్ శుడర్మానవేల్**

ప్రతి:- పరకాలన్=ఇతరమతాలకు కాలునివంటివారైన తిరుమఙ్గై ఆఴ్వార్లు, వాఴి వర్ధిల్లుగాక, కలి కన్ఱి = కలిని నశింపజేసే తిరుమఙ్గైయాఴ్వార్లు, వాఴి=వర్ధిల్లుగాక!, కుఱైయలూర్ =తిరుక్కుఱైయలూర్‌లో, వాఴ్=వర్ధిల్లే, వేన్దన్=ప్రభువైన తిరుమఙ్గై ఆఴ్వార్లు, వాఴి =వర్ధిల్లుగాక!, మాయోనై=భగవానునిదగ్గరనుండి, వాళ్ వలియాల్=తమ ఖడ్గం బలిమితో, మన్దిరమ్ కొళ్ = తిరుమంత్రాన్ని పొందినవారు, తూయోన్ = పరమపవిత్రులైన, మఙ్గైయర్కోన్=తిరుమఙ్గైయాఴ్వార్ల, శుడర్=ప్రకాశించే, మానమ్ =గొప్పతనాన్నికల, వేల్=వేలాయుధం, వాఴి=వర్ధిల్లుగాక! (అర్=నిరర్థకావ్యయం, పాదపూరకం)

### పిళ్ళైలోకమ్ జీయరరుళిచ్చెయ్త
### తనియన్ వ్యాఖ్యానమ్

**అవతారికై- ఎమ్బెరుమానుక్కు త్తిరుమదిళ్ పోలే అరణాయిరుప్పదాన అఱు ప్రబన్ధఙ్గళ్ శెయ్దరుళిన ఆఴ్వారుడైయ తిరునామఙ్గళ్ పలవఱ్ఱైయుమ్ శొల్లి అవరై వాఴ్త్తుకిఱదు ఇదిల్. "ప్రత్యక్షే గురవః స్తుత్యాః" ఎన్నక్కడవదిఱే. ఆఴ్వార్కళ్ అర్చావతారమాయ్ ఎప్పోదు మెల్లార్క్కుమ్ ప్రత్యక్షరాయితే యిరుప్పదు.**

**వ్యాఖ్యానమ్:- (వాఴి పరకాలన్) భగవద్విట్టుక్కళాన ప్రతికూలర్క్కు క్కాలనానవర్ వాఴి. (వాఴి కలికన్ఱి) కలిదోషనివారకర్ వాఴి. (కుఱైయలూర్ వాఴి వేన్దన్వాఴి) తిరుక్కుఱైయలూరై అవతారస్థలమాక ఉడైయరాయ్, అదు వాఴుమ్బడిక్కు అత్తై నోక్కుకిఱ రాజా వెన్నుతల్; అఙ్గే వాఴుకిఱవరెన్నుతల్. (మాయోనై వాళ్ వలియాల్ మన్దిరఙ్గొళ్**

**మఙ్గైయర్ కోన్ తూయోన్ శుడర్మాన వేల్ వాఴియరో) ఎన్ఱు ఆఴ్వారైయుమ్, అవర్‌తిరుక్కైయిల్ వేలైయుమ్ ఒరుకాలే ఆశాసిత్తపడి. (మాయోనై) "అరఙ్గత్తరవణైప్పళ్ళి కొళ్ళుమ్ మాయోనై"యిఱ్ఱే వాళ్‌వలియాల్ మన్దిరమ్ కొణ్డదు. తెన్నరఙ్గన్‌తన్నై వఴిపఱిత్తవాళనిఱ్ఱే. కైప్పొరుళ్‌కళ్ మున్నమే కైక్కొణ్డవరిడత్తిలేయిఱ్ఱే మన్దిరప్పొరుళ్ కైక్కొణ్డదు. మన్దిరత్తైప్పఱ్ఱియిఱ్ఱే మన్దిరమ్ కొణ్డదు. (మఙ్గైయర్‌కోన్) మఙ్గైమన్ననిఱ్ఱే. (తూయోన్) తూయ్‌మై యెన్నుమ్ బాహ్యాభ్యన్తరశుద్ధియై యుడైయవర్. "అఙ్గమల త్తడవయల్ శూఴాలినాడనరుళ్ మారియరట్టముక్కి యడైయార్ శీయమ్ కొఙ్గుమలర్ క్కుఴలియర్ వేళ్ మఙ్గైవేన్దన్ కొఱ్ఱవేల్ పరకాన్ కలియన్" ఎన్ఱు తామే తమ్ తిరునామఙ్గళై క్కూఱినారిఱ్ఱే. (శుడర్ మాన వేల్) తేజోరూపమాన, మానవేల్ - పెరియవేల్. తిరుమఙ్గైమన్నన్ ఎడుక్కుమ్పడియాన వేల్. (వాఴియరో) ఇత్తాల్ - ఆఴ్వారోపాది ఆయుధముమ్ ఆశాస్య మెన్ఱపడి. "నిన్ కైయిల్ వేల్ పోఱ్ఱి" ఎన్నక్కడవదిఱ్ఱే. ఇతుతాన్, కొఱ్ఱవేలాకైయాలే వెఱ్ఱివేలాయిరుక్కుమ్. అత్తాలే ఇతిన్ విజయత్తై వేణ్డుకిఱదు.**

## అనువాదం

అవతారిక:- దీనిలో భగవానునకు కోటలవలె రక్షకాలై ఉండే **పెరియతిరుమొఴి, తిరుక్కుఱున్దాణ్డకమ్, తిరువెఴుకూఱ్ఱిరుక్కై. శిఱియతిరుమడల్, పెరియతిరుమడల్, తిరునెడున్దాణ్డకమ్**-అనే ఆఱు ప్రబంధాలను అనుగ్రహించిన ఆఴ్వార్ల తిరునామాలను పెక్కింటిని అనుసంధించి, వారికి మంగళాశాసనం చేయబడుతున్నది. ఈ పాశురం **"ప్రత్యక్షే గురవ స్తుత్యాః"** (ఆచార్యులు నేరుగా స్తుతింపబడదగినవారు) అనే ప్రమాణార్థాన్ని తెలుపుతున్నది. ఆఴ్వార్లు అర్చావతారరూపంలో దివ్యదేశాల్లో ప్రత్యక్షంగా వేంచేస యున్నారు. అట్టి వీరికి పల్లాణ్డును ఈ తనియన్ పాడుతున్నదని భావం.

వ్యాఖ్యానమ్ః-(**వాఴి పరకాలన్) "పరకాలన్"**-అనే నామాన్ని కల ఆఴ్వార్లకు పల్లాణ్డు. **"పరకాలన్"** అనే నామంలోని పరశబ్దం భగవానుని ద్వేషించేవారిని నిర్దేశిస్తుంది. వారికి కాలునివలె, భయంకరులై ఉన్నందున **"పరకాలన్"** అనే పేరు వీరికి కల్గింది. (**వాఴి కలికన్ఱి**) కలిదోషాన్ని పోగొట్టగలవారు అనే పేరును కలవారికి పల్లాణ్డు. **(కుఱైయలూర్ వాఴ్ వేన్దన్ వాఴి)** "తిరుక్కుఱైయలూర్ అనే దివ్యదేశాన్ని నివాసస్థానంగా కలవారై, ఆ ఊరు ఉజ్జీవించేటట్లు నివసించేవారు" - (అనే అర్థాన్ని ఇక్కడ గ్రహించడానికి వీలున్నా, తన పరిపాలనతో ఆ ఊరికి ఉజ్జీవనాన్ని అనుగ్రహించేవారు అనే ముందు తెల్పిన అర్థమే సరసమైనది. ఇక, వారికి, వారి వేలాయుధానికి కలిపి పల్లాణ్డు పాడుతున్నారు, **(మాయోన్ వాళ్ వలియాల్ మన్దిరమ్ కొళ్ మఙ్గైయర్‌కోన్ తూయోన్ శుడర్ మానవేల్)**-అని అంటూ. **(మాయోనై)-"కడియరఙ్గత్తరవణైయిల్ పళ్ళికొళ్ళుమ్ మాయోనై"** (పెరుమాళ్ తిరుమొఴి-1-2) (సువాసనను కల తోటలచే పరివేష్ఠితమైన శ్రీరంగ క్షేత్రంలో శయనించిఉండే ఆశ్చర్యాన్ని కలిగించేవాడు) అని కులశేఖరాఴ్వార్లచే కీర్తింపబడ్డ ఆశ్చర్యభూతుడైన మాయావినికదా తన కత్తిబలిమిని చూపి జయించి, వీరు మంత్రోపదేశాన్ని పొందారు. **"వాఴి శుఴి పొఱిత్త నీర్‌ప్పొన్ని త్తెన్నరఙ్గన్‌తన్నై వఴి పఱిత్త వాళన్ వలి"** (ఇయల్ శాఱ్ఱు-2) (సుడులతో నిండిన నీటిని కల కావేరి నదిచే చుట్టబడినది, అందమైనది అయిన శ్రీరంగంలో పరుండిఉండే శ్రీరంగనాథుని దారిలో కొల్లగొట్టిన ఖడ్గాన్ని కల్గిన ఆళ్వార్ల బలానికి మంగళం) అంటూ వీరు తమ ఖడ్గబలంతో మంత్రోపదేశాన్ని పొందినది శ్రీరంగనాథునివద్దనే అని కదా చెప్పబడుతున్నది. **"కైప్పొరుకళ్ మున్నమే కైక్కొణ్డార్ కావిరి నీర్ శెయ్ ప్పురళ ఓడుమ్ తిరువరఙ్గచ్చెల్వనార్"** (నాచ్చి-తిరు-11-6) (కావేరి జలం సస్యక్షేత్రాలను ముంచివేసేటట్టుగా పుష్కలమైన నీటినిగల కావేరినది ప్రవహించే శ్రీరంగంలోని శ్రీమంతుడు ఇంతకుముందే నాచేతిలో ఉండే వస్తువులను అన్నిటిని అపహరించాడు) అనే రీతిలో తనను ఆశపడినవారి చేతిలో ఉన్నదంతా అపహరించే వారివద్దనే తిరుమంత్రార్థాన్ని అపహరించిన వీరి సామర్థ్యాన్ని ఏమని పొగడేది? **"అన్దణర్ మాట్టన్దివైత్త మన్దిరమ్"** (తిరునెడు-4) (బ్రాహ్మణుల సంపద అయిన వేదంలో చివర వెలిగే గొప్ప మంత్రంవంటి వాడు) అని మంత్రంగా చెప్పబడే భగవానుని ఆశ్రయించేకదా వీరు తిరుమంత్రార్థాన్ని పొందారు. **(మఙ్గైయర్‌కోన్)** - తిరుమఙ్గైనాడుకు ప్రభువుకదా వీరు! **(తూయోన్)** అనన్యార్హశేషత్వం (భగవానునకు తప్ప వేఱెవ్వరికీ శేషభూతుడు కాకుండా ఉండడం), అనన్యశరణత్వం (భగవానుని తప్పవేఱు దేనిని ఉపాయంగా తలచకుండా ఉండడం), అనన్యభోగ్యత్వం (భగవానుని తప్ప వేఱుదేనినీ అనుభవింపతగినదిగా తలచకుండా ఉండడం) మొదలైన ఆంతరశుద్ధిని, పంచసంస్కారాలను కలిగి ఉండడంవంటి బాహ్యశుద్ధిని కలవారు. ఈ పాశురంలో వీరికి చెప్పబడ్డ తిరునామాలను, వైభవాలను, మిగిలిన వానిని అన్నిటిని **"అఙ్కమలత్తడవయల్ శూఴ్ ఆలినాడన్ అరుళ్ మారి అరట్టముక్కి అడైయార్ శీయమ్ కొఙ్కుమలర్ క్కుఴలియర్ వేళ్ మఙ్గైవేన్దన్ కొఱ్ఱవేల్ పరకాలన్ కలియన్"** (పెరియతిరు-3-4-10) (అందమైన తామరలతో నిండిన తటాకాలతో కూడిన సస్యక్షేత్రాలచే చుట్టబడిఉండే తిరువాలి అనే క్షేత్రానికి నాథులు భక్తుల పట్ల కృపను వర్షించే మేఘంవంటివారు, వారికి హానిచేసేవారిని తల ఎత్తకుండ అణచివేసేవారు, శత్రువులకు సింహం వంటివారు, తేనె సమృద్ధిగా స్రవించే పువ్వులతో అలంకరింపబడిన కేశపాశాన్ని కల్గిన స్త్రీలకు ఆశపడదగినవారు, తిరుమంగై నగరానికి ప్రభువు, జయాన్ని కలిగించే వేలాయుధాన్ని కలవారైన పరకాలురనే పేరుకల తిరుమంగై ఆళ్వార్లు) అంటూ ఈ ఆఴ్వార్లే అనుగ్రహించారు కదా! **(శుడర్ మాన వేల్)**- జ్యోతిస్స్వరూపం అయిన గొప్ప వేలాయుధం. ప్రకాశంలో, గొప్పతనంలో తిరుమఙ్గై ఆఴ్వార్లు స్వీకరించతగిన

వేలాయుధం- (అని భావం. **(తూయోన్ వేల్ వాఴియరో)** ఆఴ్వార్లవలె వారి వేలాయుధంకూడా పల్లాణ్డు పాడతగినది అని భావం. **"నిన్ కైయిల్ వేల్ పోఱ్ఱి"** (తిరుప్పావై-24) (నీ చేతిలోని వేలాయుధానికి మంగళం) అంటూ శ్రీకృష్ణునకు పల్లాణ్డు పాడినవారు వానిచేతిలో వేలాయుధానికికూడా పల్లాణ్డుపాడినవారే కదా! ఈ వేల్ గొప్పతనాన్ని **"కొఱ్ఱవేల్"** (పెరియ తిరు-3-4-10) అంటూ ఆఴ్వార్లు స్వయంగా అనుగ్రహించారు. కనుక మిగిలిన వేలాయుధాలవలె పరాజయాన్ని చవి చూడకుండా ఇది **"వెఱ్ఱివేల్గా"** ఉంటుంది. అయినా, తమ ప్రేమాధిక్యంచేత వీరు దీనికికూడా పల్లాణ్డు పాడారు. ఈ తనియన్‌ను భగవద్రామానుజులు అనుగ్రహించారని ప్రసిద్ధి. ఇది పెరియతిరుమొఴి తనియన్ పాశురాలలో ఒకపాశురం కూడా.

### రెండవ తనియన్

**శీరార్ తిరువెఴు కూఱ్ఱిరుక్కై యెన్నుమ్ శెన్దమిఴాల్**
**ఆరావముద ఙ్కుడన్దై ప్పిరాన్దడియిణైక్కీఴ్**
**ఏరార్ మఱై ప్పొరుళెల్లా మెడుత్తివ్వులకుయ్యవే**
**శోరామల్చొన్న వరుళ్మారి పాదమ్ తుణై నమక్కే.**

శీర్ = శబ్దార్థవైభవంతో, ఆర్ = నిండిన, తిరువెఴుకూఱ్ఱిరుక్కై ఎన్నుమ్= "తిరువెఴుకూఱ్ఱిరుక్కై" అనే పేరును కల, శెమ్ తమిఴాల్ = అందమైన ద్రావిడ ప్రబంధంతో, ఆరావముదన్ = ఆరావముదన్ అనే పేరును కల, కుడన్దై పిరాన్‌తన్ = తిరుక్కుడన్దై స్వామియొక్క, అడి ఇణై కీఴ్ = శ్రీపాదాల విషయంగా, ఏరార్ మఱై పొరుళ్ ఎల్లామ్ ఎడుత్తు = (అపౌరుషేయత్వం మొదలైన) గొప్పతనాలను కల వేదాలలో చెప్పబడ్డ అర్థాలను అన్నిటిని ప్రకాశించేటట్లు చూపి, ఇవ్వులకు ఉయ్యవే = ఈ లోకం ఉజ్జీవించేటట్లు, శోరామల్ శొన్న = ఒక్కటికూడా విడువకుండా చెప్పిన, అరుళ్ మారి= కృపావర్షంవంటి తిరుమఙ్గైయాఴ్వార్ల, పాదమ్ = శ్రీపాదాలే, నమక్కు తుణై = మనకు రక్షకం.

(ఈ తనియన్ చాలామంది అనుసంధానంలో లేదు)

**తనియన్ వ్యాఖ్యానానువాదం సంపూర్ణం**



### తిరుమఙ్గైయాఴ్వార్ అనుగ్రహించిన

# తిరువెఴుకూఱ్ఱిరుక్కై

### పెరియవాచ్చాన్బిళ్ళై యరుళిచ్చెయ్‌ద తిరువెఴుకూఱ్ఱిరుక్కై వ్యాఖ్యానమ్

### అవతారికై

సంసారస్వభావానుసన్ధానత్తాలే మికవు మవసన్నరాన ఆఴ్వార్, అతుక్కు ప్పరిహారమాక అవన్ గుణఙ్గళై నెఞ్జాలే నినైత్తుమ్, వాయాలే పేశియు, తిరువడికళిలే విఴున్దుమ్ ధరిత్తార్. "ఇఙ్గనే కిడన్దు నోవుపడు ముమక్కుత్తాన్ శెయ్యవేణ్డువదెన్ ? "ఎన్టు కేట్క , "త్వదనుభవవిరోధియాయిరుక్కిఱ సంసారత్తై వాసనైయోడే పోక్కి త్తరవేణుమ్" ఎన్టార్. "అదుపిన్నై నమ్మాల్ శెయ్యలావదన్టే" ఎన్న, "ఉన్నై యొఴిన్ద సకలపదార్థఙ్గళినుడైయ ఉత్పత్తియెన్న, రక్షణమెన్న - ఇవఱ్ఱుక్కు క్కడవైయాయ్, సర్వసమాశ్రయణీయనాయ్ ఆపత్సఖనాయిరుక్కిఱ నీయే యెన్నుడైయ సంసారదుఃఖత్తై క్కళైత్తు త్తరు మిత్తనైయల్లదు ఎన్నాల్ కళైత్తు క్కొళ్ళప్పోకాదు" ఎన్టు అతివిక్కిఱారా యిరుక్కిఱదు.

## మెనక్కిట్ట శ్రీవైష్ణవరుక్కాక సాదిత్తరుళిన వ్యాఖ్యానావతారికై.

ముదలిలే కరణకళేబరవిధురమాయ్, తమోభూతమాయ్, అవిజ్ఞేయ స్వరూపమాయ్, అచిత్కల్పమాయిరుక్కిఱ ఇవఱ్ఱై అర్థిత్వాది నిరపేక్షమాక ఉన్నుడైయ నిరవధికదయైయాలే యుణ్డాక్కిన నీయే యరుళి కటాక్షియాయాకిల్ "అమూని భువనాని-భవితుమ్-నాలమ్" ముతలిలే ఇవై యుణ్డాకవే మాట్టాదు. సత్తైయే తొడఙ్గి ఉన్నధీనమాన పిన్బు ఉన్నై యొఴియ ఇవక్కు ఒరు ప్రవృత్తినివృత్తి కూడాతెన్నుమిడమ్ శొల్లవేణుమో? ఇదిల్లాదవన్టు ఉణ్డాక్కిన నీయే ఇదుక్కొరు పోక్కడి పార్క్కైయొఴియ, నానొన్టు శెయ్‌తున్నైప్పెఱుకై యెన్టొరు పొరుళుణ్డో?

(శరణా మఱైపయన్ద ఇత్యాది) జ్ఞానాధికనాన చతుర్ముఖనోడేకూడ ఉత్పత్తివినాశాదికళుక్కు కర్మభవిక్కిఱ సకలచేతనర్క్కుమ్ రక్షైయెన్టు పెఱ్ఱ పెఱ్ఱవైయెల్లామ్, "నమ్మేల్ వినై కడివాన్" ఎన్గిఱపడియే ఆశ్రితవిరోధినిరసనత్తుక్కాక క్కైయిలే తిరువాఴియై ధరిత్తుక్కొణ్డిరుక్కిఱ ఉపకారకనానవవన్ పార్క్కిల్ పార్క్కుమిత్తనై యల్లదు, వేఱు కడల్ శూఴ్న్ద భూమియిలుళ్ళ చేతనర్ తఙ్గళుక్కు రక్షై తాఙ్గళతియార్కళ్. అవనై యొఴియ ఇవై యతియాతొఴియవేణ్డుకిఱదెన్నెన్నిల్, (నైవ కిఞ్చిదిత్యాది) ఉనక్కు ప్పరోక్షమా యిరుప్పదొన్టిల్లై. ఎత్తనై యేనుమ్ జ్ఞానాధికరాయిరుప్పార్క్కుమ్ నీ కణ్ణుక్కు విషయమాకాయ్. ఉనక్కు క్కైపుకురాదదొన్టుమిల్లై. ఎత్తనైయేను మతిశయిత జ్ఞానర్క్కుమ్

నీ కైపున్దాయాయిరాయ్. ఇత్తాల్ శొల్లిఱ్ఱాయ్ఱ్ఱదెన్నెన్నెన్నాల్ ఒరువనుక్కు క్కణ్ణుమ్ తోఱ్ఱాతే, కాలుమ్ నడైతారాతే యిరుప్పదు. ఒరువనుక్కు క్కణ్ణుమ్ తోఱ్ఱి, క్కాలుమ్ నడై తరువదు, ఇప్పడి యిరున్దాల్ ఆర్ వఴిక్కాట్టి క్కొడుపోవార్కళ్. నాన్ అజ్ఞనాయ్, అశక్తనాయిరున్దేన్. నీ సర్వజ్ఞనాయ్, సర్వశక్తియా యిరున్దాయ్. ఇజ్ఞనేయిరున్దపిన్బు నీ ఎన్ కార్యమ్ శెయ్దు తలైక్కట్టుమిత్తనైపోక్కి, నా నెన్ కార్యమ్ శెయ్దు తలైక్కట్టుకై యెన్టొరు పొరుళుణ్డో? వెన్గిఱార్. నీ తన్ద జ్ఞానమ్ కొణ్డఱియప్పార్త్తాలుమ్ అఱిన్దపడి శెయ్తు తలైక్కట్టుకైక్కీడాన శక్తి యెనక్కుణ్డో?

**అవతారికై ముఱ్ఱిఱ్ఱు.**

**అరుమ్బదమ్ :- ప్రవేశే - తిరుమొఴియిల్- ఉకన్దరుళిన నిలజ్గళై అనుభవిత్తు ప్పరమపదత్తైయుమ్, సంసారస్వభావత్తైయుమ్ మఱన్దిరుక్క , "నీరిరుక్కిఱదు సంసారం కిడీర్" ఎన్ఱు "మాఱ్ఱముళ" లిలే కాట్ట, ప్రతికోటియై యనుసంధిత్తు వన్ద ఆఱ్ఱామైయాలే "వాక్కినాల్ కరుమన్దన్నాల్ మనత్తినాల్ శిరత్తైతన్నాల్" ఎన్ఱు తిరుక్కుఱున్దాణ్డకత్తిలే కరణత్రయత్తాలుమ్ అనుభవిత్తు తరిక్కప్పుక అదిల్ తరిక్కప్పుకామైయాలే ఇదిలే శరణమ్ పుకుకిఱార్ ఎన్దపడి. విభూతిద్వయమ్ మఱన్దు, తృతీయవిభూతియాన దివ్యదేశజ్గళై అనుభవిక్కిఱ ఇవర్క్కు ఈశ్వరన్ సంసారత్తిల్ కొడుమైయై కాట్టువా నెన్నెన్నిల్, "ఇవ్వనుభవమ్ అవిచ్ఛిన్నమాకవేణుమ్" ఎన్ఱు నినైత్తు, అదు అజ్గే యొఴియక్కూడా మైయాలే ఆమత్తై యఱుత్తు ప్పశియై విళైప్పిత్తు చ్చోరిడువారైప్పోలే విడాయైప్పిఱప్పిత్తు, అజ్గే కొడుపోకైక్కాక క్కాట్టినానెన్ఱు శంకాపరిహారజ్గళ్ కణ్డుకొళ్వదు.**

**అవతారిక అనువాదం**

నాల్గు వేదాలను నాల్గు దివ్యప్రబంధాలుగా చేసి, అనుగ్రహించారు–**"వేదమ్ తమిఴ్శెయ్దమాఱన్"** అయిన నమ్మాఴ్వార్లు. ఆ వేదాలకు ఏర్పడిన ఆఱు అంగాలవలె ఈ వేదాలకుకూడా ఆఱు అంగాలను అనుగ్రహించారు తిరుమజ్గైయాఴ్వార్లు తమ ఆఱు దివ్యప్రబంధాలద్వారా.

వాటిలో మొదటిది అయిన పెరియ తిరుమొఴిలో భగవానుడు పరమరసికులైన తమకు తన అందాన్ని చూపించి సంస్కరించిన విధానాన్ని, తిరుమంత్రాన్ని, దాని తాత్పర్యార్థం అయిన పరత్వసౌలభ్యాది కల్యాణ గుణాలను, సౌలభ్యాది కల్యాణగుణాలకు పర్యంతసీమ అయిన అర్చావతారాలను దర్శింపజేయగా దర్శించి అనుభవించిన రీతిని, సంసారంలో తమకు ఏవగింపు కలగడం కోసం అతడు నైచ్యాన్ని దర్శింపజేయగా, **"మాఱ్ఱముళ"** (11-8) అనే చివరి తిరువాయ్మొఴిలో **"ఇరుపాడి ఎరి కొళ్ళియిన్ ఉళ్ ఎఱుమ్బేపోల్"** (రెండువైపులా మండే కట్టెలో ఉండే చీమలవలె) అని, **"వెళ్ళత్తిడైప్పట్ట నరియినమ్ పోల్"** (ప్రవాహంలో చిక్కుకున్న నక్కల గుంపువలే) ఎన్ఱుమ్, **"కాఱ్ఱత్తిడైప్పట్ట**



**కలవర్ మనమ్ పోల్"** (సుడిగాలిలో చిక్కుకొన్న నావలోనివారి మనస్సువలె) అని, **"ఆఱ్ఱజ్కరై వాఴ్ మరమ్పోల్"** (నదీతీరంలో ఉండే చెట్టువలె) అని అంటూ సంసారం లోని నైచ్యాన్ని తలచి, చాలా భయపడి వణకి, బాధపడిన రీతిని ఆఴ్వార్లు తెలియజేశారు.

ద్వితీయపబంధం అయిన తిరుక్కుఱున్దాణ్డకంలో - మండుటెండలో అలసి సొలసినవారు చల్లని నీటిలో పడి మునిగి, అంతటితో ఆగకుండా నీటిని తాగడం, ఆ నీటిని తీసికొని పైనజల్లుకోవడం చేసేటట్లే, **"మాఱ్ఱముళ"** అనే తిరుమొఴిలో తెల్పిన రీతిలో సంసారం అనే తీవ్రమైన ఎండవల్ల తాపాన్ని పొందిన తాము, ఆ తాపానికి పరిహారంగా భగవానుని తన కల్యాణగుణాలనే చల్లని జలంలో మునిగి, స్నానంచేసి, **"ఎన్ మనత్తు వన్ద విదియినై....విడుకిలేన్"** (నా మనస్సులో వచ్చి నిలిచిన భాగ్యస్వరూపుడైన భగవానుని.... విడువలేను), **"కుణమ్ కొణ్డుళ్ళమ్ కూఱు నీ కూఱుమాతే"** (కల్యాణగుణాలను పురస్కరించుకొని అనుసంధించు ఓ మనసా! నీవు అనుసంధించే రీతి ఎంతగొప్పది!) అని అంటూ కంటితో దర్శించి, **"మైన్దనై వణజ్గినేనే"** (గొప్ప బలశాలికి నమస్కరించాను కదా!) అని అంటూ శ్రీపాదాలలో పడి శిరసా నమస్కరించి, **"వాక్కినాల్ కరుమన్దన్నాల్ మనత్తినాల్ శిరత్తైతన్నాల్ వేట్కైమీదూర వాజ్గి విఴుజ్గినేఱ్కు"** (వాక్కుతో, శరీరంతో, మనస్సుతో, శిరస్సుతో అభినివేశపూర్వకంగా కైంకర్యం చేసి సంతోషించిన నాకు) అన్న రీతిలో సర్వకరణాలతో అభినివేశాన్ని పొంది ప్రాణాన్ని నిలుపుకున్నారు. ఈ స్థితిలో **"తిరువెఴుకూఱ్ఱిరుక్కై"** అనే ఈ మూడవ ప్రబంధం అవతరించడానికి వీలుగా ఆఴ్వార్లకు, భగవానునకుమధ్య చమత్కారంగా ఒక సంభాషణ ఈ విధంగా జరిగింది.

**భగవానుడు**:- ఆఴ్వార్లూ! ఈ విధంగా చాలా శ్రమపడి అయినా మీకు నేను చేయవలసినది ఏమి ఉన్నది?

**ఆఴ్వార్లు**:- స్వామీ! తిరుక్కుఱున్దాణ్డకంలో నిన్ను నేను ఒక విధంగా అనుభవించినవాడనే అయినా, ఆ అనుభవం పూర్ణంగా కలగకుండేటట్లు ఈ సంసారసంబంధం అడ్డుగా ఉన్నది. దీన్ని సవాసనగా తొలగించి, నీవు అనుగ్రహించాలి.

**భగవానుడు**- అరుదైన కార్యాలను చేసి, దాన్ని మీరు పోగొట్టుకోవాలే తప్ప, మీరు అడిగినంతమాత్రంలో నేను మీకు దాన్ని పోగొట్టడానికి వీలుకాదే!

**ఆఴ్వార్లు**:- స్వామి! స్వార్థంలో, దానికి మూలం అయిన స్వప్రవృత్తిలో నాకు సంబంధం ఉన్నదా? ఏమి? అని శోధించడం కోసం నీవు ఈ విధంగా పల్కిన మాట ఇది అని నేను తెలిసికోలేనా! సొత్తు అయి నన్ను సొత్తు దారుడవైన నీవు పొందడానికిగా అనాదికాలంగా ఎంతగా పాట్లు పడుతున్నావు? నాకు ఏవో కొన్ని సుఖాలను నేను సాధించుకుంటున్నట్లుగా

భావించి, దేనిని అయినా చేసి, నీవు పడేపాట్లను సఫలం కాకుండేటట్లు అడ్డగించి, నిర్వీర్యం చేయడమే కదా అనాదికాలంగా నా ప్రయత్నంతో నేను చేస్తున్నాను. నన్ను, నా వంటి మిగిలిన చేతనులను పొందడానికిగా ఎంతకాలంగానో నీవు ఎన్నో పడరాని పాట్లను పడుతున్నావు కదా! ప్రళయకాలంలో దేహేంద్రియాలను లేనివారమై, అవిభక్తతమస్సు అనే పేరుతో నీతో కలసి ఒకటిగా ఉన్న అచేతనతత్త్వం అయిన మూలప్రకృతితో విభాగించి చూడడానికి వీలులేనట్లు కలసి ఉన్నాముకదా మేము! ఈ విధంగా అచేతనతత్త్వంతో పోలి ఉన్న మమ్ములను, మేము యాచించకుండానే, నీ అపారకరుణతో, దేహేంద్రియాలతో కలిపి సృష్టించి, నిర్హేతుకకృపతో నీవే అనుగ్రహించి కటాక్షింపక పోయినట్లయితే "ఈలోకాలు సృష్టింపబడి ఉండేవి కావు" (స్తోత్ర-10) అని పలికేటట్లు మేమొక వస్తువుగా ఉండి ఉండేవారం కాము కదా! ఈ విధంగా మా సత్తమొదలుగా అంతా నీ అధీనం అయిన తర్వాత నిన్ను తప్ప మాకు ఒక ప్రవృత్తి, ప్రవృత్తినుండి విరమించడం అనే నివృత్తి సంభవించదనే విషయాన్ని వేరే చెప్పాలా? ఈ విధంగా ఏది నా అధీనం కానప్పుడు నన్ను సృష్టించిన నీవే నన్ను రక్షించడానికి ఒక దారిని వెదుకవలసి ఉన్నది తప్ప, నేనొక పనిని చేసి నిన్ను పొందవలసి ఉన్నదని చెప్పడానికి వీలున్నదా? దీనినేకదా **"శరణామత్తై పయన్ద తామరైయానోడు మరణాయ మన్నుయిర్కట్కెల్లామ్-అరణాయ పేరాழிకొణ్డపిరానన్ఱి మఱ్ఱారఱియాదు ఓరాழி శూழ்న్ద వులకు"** (ముదల్ తిరు-60) (అందరికీ హితాన్ని తెలిపే వేదాన్ని ఉపదేశంగా పొందిన బ్రహ్మతోపాటు, మరణించే స్వభావాన్ని కల జీవులకు - అందరికీ రక్షకమైన గొప్ప చక్రాన్ని చేతిలో కల్గిన స్వామి తప్ప, అద్వితీయమైన సముద్రాన్ని చుట్టూకల్గిన ఈ లోకంలో వేఱొక రక్షకులు ఎవరున్నారు?) పాయ్కై ఆழ்వార్లు అనుగ్రహించారు. లోకం లోనివారు ఉజ్జీవించడానికి ఉపాయాలను ఉపదేశించే వేదాన్ని అనుగ్రహించిన జ్ఞానవైశద్యాన్నికల బ్రహ్మ మొదలుగా జన్మమరణాలకు అధీనులైన సమస్తచేతనులకు రక్ష అనే పేరును కల ఏ కార్యాన్ని అయినా **"నమ్మేల్ వినైకడివాన్ ఎప్పోదుమ్ కైకழలా నేమియాన్"** (పెరియ తిరువ-87) (మన పాపాలను ఎల్లప్పుడు సుదర్శనాన్ని ధరించే స్వామి పోగొడతాడు.) అన్నట్లు ఆழ்వార్ల విరోధులను నశింపజేయడానికి వీలుగా ఎల్లప్పుడూ శ్రీసుదర్శనాన్ని ధరించి ఉన్న ఉపకారకుడవైన నీవు చేస్తే చేయాలి తప్ప, సముద్రపరివేష్ఠితం అయిన ఈ లోకంలో ఉన్న వేఱెవ్వరు తమకు రక్ష ఏది? అనే దాన్ని తాముగ్రహించలేరే! తమకు తాము రక్షించుకోవడం అనేది ఏ విధంగా సాధ్యం ?

**భగవానుడు**- జ్ఞానాధికులు పలువురుండగా నేను తప్ప వేఱెవ్వరు తమ రక్షణను గూర్చి తాము తెలుసుకోలేరు అని ఏ విధంగా అంటున్నారు?

**ఆழ்వార్లు**- **"నైవ కించిత్ పరోక్షం తే ప్రత్యక్షోఽసి న కస్యచిత్, నైవ కించి దసిద్ధం తే న చ సిద్ధోఽసి కస్యచిత్"** (జితంతే-1-6) (నీకు ప్రత్యక్షం కానిది ఏదీ లేదు. నీవు ఎవరికిని



తమ ప్రయత్నంతో ప్రత్యక్షంగా కన్ను మొదలైనవానితో గ్రహించడానికై వీలైనవాడివిగా కావు. నీకు పొందడానికి సాధ్యం కానిది అంటూ ఏదీ లేదు. ఎవరికి కూడా స్వప్రయత్నంతో పొందడానికి వీలైనవాడవు కావు. నీకు తెలియరానిది, పొందడానికి సాధ్యం కానిది అనేది ఏదీ లేదు) అన్నట్లు సర్వజ్ఞుడవు, సర్వశక్తివి నీవు. ఎంతటి జ్ఞానాన్ని, శక్తిని కలవారైనా వారు నిన్ను స్వప్రయత్నంతో తెలిసికోవాలనో, పొందాలనో చూస్తే, వారికి నీవు తెలియరావు, పొందడానికి వీలుకావు. నీకు మాకు మధ్య ఉన్న తారతమ్యం ఏవిధంగా ఉన్నది అన్నది ఒక ఉదాహరణంతో వివరించవచ్చు. ఒకడు కన్ను లేని గుడ్డివాడు, కాలు లేని కుంటివాడుగా ఉన్నాడు, ఇంకొకడు చక్కని నేత్రాలను, నడకను కలవాడుగా ఉన్నాడు. ఈ ఇద్దఱిలో రెండవవాడు దారిచూపిస్తే తప్ప మొదటివాడు తన పనిని దేనిని చేసికోలేడుకదా! ఆవిధంగానే, నేను జ్ఞానలవలేశం లేని గుడ్డివాడనై, దేన్నీ చేయలేని అశక్తినికల కుంటివాడనై ఉన్నాను. "**సర్వజ్ఞః సర్వవిత్**" అని వేదం తెలుపుతున్న రీతిలో నీవు అన్నిటిని తెలిసినవాడవై, అన్నిటినీ చేయగలవాడవై ఉన్నావు. నీవిట్టివాడవైనపుడు, నీవు నా కార్యాన్ని చేసి పూర్తి చేయాలే తప్ప నేను నా పనిని చేసి పూర్తి చేయడానికి కొంచెం అయినా అవకాశం ఉన్నదా? నీవు అనుగ్రహించిన జ్ఞానంతో ఏదో ఒక విధంగా తెలిసిన, తెలిసినంతగాకూడా చేయగల శక్తి నాకున్నదా? అందువల్ల, నిన్ను తప్ప మిగిలిన వస్తువుల సృష్టి, స్థితి, లయాలు మొదలైనవానిని అన్నిటినీ చేసేవాడవై, బ్రహ్మరుద్రాదులు అందఱిచేత ఆశ్రయింపబడేవాడవై, వారికి కలిగే ప్రతి ఆపదలోను సహాయపడేవాడవై ఉన్న నీవే నా సంసారదుఃఖాన్ని తీర్చాలి తప్ప నేను తీర్చుకోవడానికి ఎంతమాత్రం సాధ్యం కాదు"- అని అంటూ భగవానుని శ్రీపాదాలలో పడి తమ అనన్యగతికత్వాన్ని ఆ భగవానుని సమక్షంలో విన్నవించే ప్రబంధమే ఈ తిరువెఴుకూఱ్ఱిరుక్కై.

అష్టాక్షరిని, అందులోని ప్రధానార్థం అయిన సౌలభ్యాది గుణాలకు పర్యంతసీమ అయిన అర్చావతార స్థలాలైన శ్రీరంగాది దివ్యక్షేత్రాలను దర్శింపజేయగా, బదరి మొదలు తిరుక్కోట్టియూర్‌వరకుగల వానిని అన్నిటినీ దర్శించి, ఇంతకంటే దేన్నీ కోఱనివారై, సంసారాన్ని, పరమపదాన్నికూడా సమానంగా మఱచిపోయారు ఈ ఆழ்వార్లు-పెరియ తిరుమొழி అనుభవాతిశయంచేత. "అర్చావతారానుభవంలో మునిగి, సంసారదౌష్ట్యాన్ని. ఈ అనుభవం నిత్యంగా కొనసాగడానికి పరమపదానికి వెళ్ళాలనే సత్యాన్ని వీరు మఱచిపోయారే! వీరికి ఈ సంసారకార్యాన్ని తెలియజేస్తాను" అని తలచిన భగవానుడు, బిడ్డకు అజీర్ణాన్ని పోగొట్టి, ఆకలిని కల్గించి, అన్నాన్ని పెట్టే తల్లివలె వీరికి పరమపదానుభవంలో ఆశను కల్గించి అక్కడికి తీసికొని పోవడంకోసం **"మాఱ్ఱముళ"** అనే చివరి తిరుమొழிలో సంసారదౌష్ట్యాన్ని తెలియజేశాడు. దాని క్రౌర్యాన్ని అనుసంధించి, ఆర్తితో తమ మనోవాక్కాయాలతో భగవానుని అనుభవించి కొంత ఉపశమనాన్ని

పొందాలని ఆఴ్వార్లు తిరుక్కుఱున్దాణ్డకంలో చూచారు. మనోవాక్కాయాలతో అతనిని అనుభవించగా అనుభవించగా ఆశ మరింత మరింత వృద్ధిచెంది, ఇంకా ఆర్తి కల్గడంవల్ల, భగవానుడు అందఱికి ఆశ్రయణీయుడు అనే విషయాన్ని పల్కుతూ, శరణు పొందేవారికి అంతా తానే శరణం కావడం చేత, నమ్మాఴ్వార్లచేకూడ శరణాగతి చేయబడ్డ తిరుక్కుడన్దైలోని స్వామి అయిన ఆరావముదాఴ్వార్ శ్రీపాదాలను సర్వదా తమ ఇష్టప్రాప్తికి, అనిష్టనివృత్తికి ఉపాయంగా ఆశ్రయించి ఈ తిరువెఴుకూఱ్ఱిరుక్కైను ఆఴ్వార్లు పరిసమాప్తి చేశారు.

అవతారిక అనువాదం ముగిసింది.

**ఒరు పేరున్ది యిరు మలర్త్తవిశిల్**
**ఒరు ముఱై యయనై యీన్ఱనై.**

ఒరు=విలక్షణమైన, పేర్ = గొప్పతనాన్నికల, ఉన్ది యీన్ఱనై=తిరునాభినుండి పుట్టిన, ఇరు=పెద్దదైన, మలర్ =(తామర) పూవు అనే, తవిశిల్=ఆసనంపైన, ఒరు ముఱై=ఒకసారి, అయనై=బ్రహ్మను, ఈన్ఱనై=సృష్టించావు.

**పెరియ-ప్రథమ - (ఒరుపేరిత్యాది) స్వవ్యతిరిక్తసమస్తవస్తుక్కళుక్కుమ్ అద్వితీయ-కారణమాయ్, అదుక్కు త్తక్క పరప్పైయుడైయ తిరునాభియిలే, అప్పరప్పడఙ్గలుమ్ కణ్ శెఱియిట్టాప్పోలే పెరుత్తిరుక్కిఱ మలరాకిఱ ఆసనత్తిలే ఒరుకాల్ ఇతరవిసజాతీయ జన్మానాన చతుర్ముఖనై యుణ్డాక్కినాయ్. ఒరుకాలెన్ఱాలుమ్ ప్రవాహరూపేణ నిత్యమా యిరుక్కు మిఱే. "నావేక్షసే". ఆఴ్వార్క్కు ముతలిలే శెప్పేట్టై క్కైయిలే కొదుత్తు నిధియై ప్పోలే తిరుమన్త్రత్తైయుమ్, అది లర్థత్తుక్కు ఎల్లైనిలమాక కోయిల్కళైయుమ్ కాట్టికొడుక్క క్కణ్డు, కృతకృత్యరాయ్ సంసారత్తైయుమ్, పరమపదత్తైయుమ్ ఒక్క మఱన్దార్. ఆఴ్వారై ప్పార్త్తు ఎమ్బెరుమాన్ "నీరిరుక్కిఱతు సంసారత్తిలేకిడీర్" ఎన్ఱు అరుళిచ్చెయ్య, అదిన్ కొడుమైయై యనుసన్ధిత్తు అఱ్ఱామైయాలే మనోవాక్కాయఙ్గళాలే ఎమ్బెరుమానై యనుభవిత్తు ఆఱ్ఱప్పార్త్తార్. అతు పణ్డైయిలుమ్ ఇరట్టియాయ్, మికవు మాఱ్ఱామైయాలే ఎమ్బెరుమానుడైయ శరణ్యత్వత్తై ప్పేశికొణ్డు అతుక్కెల్లైనిలమాన తిరుకుడన్దైయిల్ ఆరావముతాఴ్వార్ తిరువడికళైయే ఎద్దశైక్కుమ్ ఇష్టప్రాప్తిక్కుమ్, అనిష్టనివారణత్తుక్కుమ్ ఉపాయమాక ప్పఱ్ఱి ముడిక్కిఱార్.**

**(ఒరు పేరున్దియిత్యాది) జగత్తుప్రళయఙ్గొణ్డకాలత్తు ఉన్నుడైయ నిర్హేతుకకృపైయాలే ఇవఱ్ఱినుడైయ సత్తైయై యుణ్డాక్కినవనే! (ఒరు పేరున్ది) ప్రధానమాయ్ ఆద్యమాయిరున్ద తిరునాభియిలే. (ఇరుమలర్ త్తవిశిల్) పెరియ తామరైప్పూవిన్ అల్లియిలే. (ఒరు ముఱై యయనై యీన్ఱనై) ఒరుకాల్ జగత్సృష్టిక్కడియాక బ్రహ్మావై యుణ్డాక్కినాయ్. ఇవఱ్ఱినుడైయ**



**సత్తాదికళై ముతలిలే యుణ్డాక్కిన ఉనక్కే భరమన్ఱో? ఎల్లా రక్షైయు మెన్గిఱార్. నీ యుణ్డాక్కిన విదుక్కు ఒరు గుణమ్ పిఱప్పిక్క వరిదో?**

**పెరియ-ద్వితీయ - (ఒరుపేరిత్యాది) నామరూపవిభాగానర్హమాయ్, త్తన్నోడవిభక్తమా-యిరుక్కిఱ ఇత్తై విభక్త మాక్కి, తమశ్శబ్దత్తుక్కు వాచ్యమాక్కి, అనన్తరమ్ సూక్ష్మరూపేణ "అక్షరమ్, అవ్యక్తమ్" ఎన్గిఱ అవస్థైకళై ప్పిఱప్పిత్తు, పిన్నై మహానాక్కి, అహఙ్కార మాక్కి, తన్మాత్రైకళాక్కి, భూతఙ్గళాక్కి, భౌతికమాన వర్ణసృష్టియళవుమ్ వరప్పణ్ణి, పిన్నై యవ్వరుకుణ్డాన దేవాదికార్యఙ్గళై యడఙ్గలుమ్ అవన్ముఖత్తాలే పణ్ణువదాక ముదలిల్ చతుర్ముఖనై యుణ్డాక్కినానాయిఱ్ఱు. మున్బుళ్ళవైయెల్లామ్ తానే కైతొట్టు చ్చెయ్దు, పిన్బు చతుర్ముఖనై అధిష్ఠిత్తు నిన్ఱు శెయ్వానాకప్పార్త్తాన్. మున్బు అవఱ్ఱై (అచిత్తై) క్కొణ్డు కార్యఙ్గొణ్డత్తోడు, ఇవనై క్కొణ్డు కార్యఙ్గొళ్ళప్పార్త్తత్తోడు వాశియఱ్ఱిరుక్కిఱదాయిఱ్ఱు. ఇవనుక్కు పారతన్త్ర్యత్తిల్ వన్దాల్ ఇవనుక్కు మచిత్సామ్య ముణ్డు. చేతనరాన వాశియాల్ పెఱుకిఱ వేఱ్ఱుమ్ "కార్యత్తుక్కు క్కడవానవనే" ఎన్ఱు అఱుతియిట్టిరుక్కైయాయిఱ్ఱు.**

**అరు :- (ఒరు పేరున్ది) - ఇత్యాది. (ఒరు పేరున్ది)-మున్దినదుమాయ్, అదుదాన్ పఴైయదుమాయిరుక్కై. (తవిశిల్) - అల్లియాయ్, ఇదఴై చ్చొల్లుకిఱదు.**

**పెరియ-అను :- (ఒరు పేరున్ది ఇరు మలర్ త్తవిశిల్ ఒరు ముఱై అయనై ఈన్ఱనై)**-తనకంటె వేఱయిన సమస్తవస్తువులకు అద్వితీయకారణమై. అట్లు కారణం అవడానికి తగిన మహత్వాన్ని కల (విస్తృతిని కల) నాభిలో దాని వైశాల్యం అంతా కల్గి ఉన్నట్లున్న తామరపూవు అనే ఆసనంలో, పూర్వం ఒకానొక సమయంలో (సృష్టికాలంలో). **"న జాయతే ఇతి అజః"** (మిగిలినవారివలె స్త్రీపురుషసంయోగంతో జన్మించనివాడు కనుక బ్రహ్మ అజుడనబడుతున్నాడు) అనే వ్యుత్పత్తిద్వారా జన్మనుకల మిగిలినవారికంటె మిక్కిలి విలక్షణమైన జన్మను కలవాడు కావడంచేత అజుడనే పేరును కల చతుర్ముఖుని సృష్టించావు. **"ఒరు ముఱై"** - అని అంటూ సృష్టి కాలాన్ని చెప్పినది ప్రతి ప్రళయానికి తరువాత సంభవించే సృష్టికాలాన్ని సూచిస్తుంది. కాబట్టి ఈ బ్రహ్మసృష్టి ప్రవాహరూపంలో నిత్యంగా ఉంటుందని భావం. ఈ విధంగా బ్రహ్మసృష్టిని ప్రకృతంలో నిర్దేశించడం లోకసృష్టికి కూడా ఉపలక్షణమే. **"నావేక్షసే యది తతో భువనాన్యమూని నాలం ప్రభో భవితు మేవ కుతః ప్రవృత్తిః"** (స్తోత్ర.ర-10) (స్వామి! నీవు కటాక్షించకపోయినట్లయితే సృష్టికాలంలో ఈ లోకాల సృష్టి సంభవించి ఉండేది కాదు. ఇక నీ కటాక్షమే లేకపోతే వీటికి ప్రవృత్తి ఏ విధంగా కలుగుతుంది) అనే రీతిలో వీటి సత్తకూడా నీ అధీనం అయిన తర్వాత వీటి కార్యాన్ని నీవే కదా చేయాలి - అని తెలుపడంకోసం ఈ ప్రయోగం.

**(ఒరు పేరున్ది)**-లోకానికి ప్రళయం సంభవించిన కాలంలో నీ నిర్హేతుకకృపతో వీటికి సత్తను కల్గించినవాడా! **(ఒరు పేర్ ఉన్ది)-"ఒరు"** అనే ప్రయోగం అన్ని లోకాలకు

ఉత్పత్తి స్థానంగా ఉండే నాభియొక్క ప్రాధాన్యాన్ని తెలుపుతున్నది. **"పేర్"** అన్నది ప్రాచీన మైన దాని వైభవాన్ని తెలుపుతున్నది. **(ఇరు మలర్ త్తవిశిల్)**–గొప్పదైన తామరపూవు రేకులో. **(ఒరు ముఱై అయనై ఈన్ఱనై)**– పూర్వం ఒకానొక సమయంలో లోకసృష్టికి తగినట్లు చతుర్ముఖుని సృష్టించావు. వీటి సత్త మొదలైనవాటిని మొదట సృష్టించిన నీకే కదా వీటిని ఏ రీతిలోనైనా రక్షించడంలో కూడా బాధ్యత ఉన్నది – అని అంటున్నారు. నీవు సృష్టించిన దీనికి ఒక గొప్పతనాన్ని అనుగ్రహించడం నీకు ఏ కష్టం?– అని దీని తాత్పర్యం.

ఈ సందర్భంలో బ్రహ్మసృష్టి చెప్పబడడంద్వారా దానికి ముందున్న సృష్టి అంతా ఉపలక్షింపబడుతున్నది. అంటే నామరూపాదులతో విభాగించి, చూడడడానికి వీలులేనట్లు భగవానునితో ఒకటిగా కలసి ఉండడంచేత **"అవిభక్తతమస్సు"** అనబడే మూలప్రకృతిని విభాగించి చూడవీలైనదై, **"విభక్త తమస్సు"** అనే పేరును కల్గినది అయిన స్థూలతత్త్వంగా చేసి, ఆ తరువాత, దానికంటె కొంచెంగా స్థూలావస్థలు పొందిన **మహాన్, అహంకారం**– అనే తత్త్వాలను సృష్టించి, ఆ అహంకారాలనుండి శబ్దస్పర్శరూపరసగంధ– తన్మాత్రాలను, పంచమహాభూతాలను సృష్టించి, ఆ పంచభూతాలతో కూడిన అండాన్ని సృష్టించి, దేవ–మనుష్య–తిర్యక్–స్థావరాలనే నాల్గు విధాలైన శరీరాలను కల్గినది అయిన చేతనులను వీటి మూలంగా సృష్టించడానికి మొదట ఈ చతుర్ముఖుని సృష్టించావు. అండసృష్టిని చేయడంవరకు ఉన్న సమష్టిసృష్టిని తానే తన సంకల్పంతో చేసి, ఆ తరువాతగల వ్యష్టిసృష్టిని ఇతనికి – అంటే, బ్రహ్మకు అంతర్యామిగా నిలచి చేయడంకోసం ఇతనిని సృష్టించాడు. సమిష్టిసృష్టిలో ప్రకృతితో మహాన్‌ను, మహాన్‌తో అహంకారాన్ని, అహంకారంతో తన్మాత్రాదులను సృష్టించడానికి, ఈ బ్రహ్మద్వారా అండాతర్వర్తులైన అచేతనవస్తువులను, దేవమనుష్యాదులను సృష్టించడానికి సర్వేశ్వరునకు ఏ బేధం లేదు. పారతంత్ర్యాన్ని చూచేటపుడు ఆ అచేతనద్రవ్యాలతో, చేతనుడైన బ్రహ్మకు పరిపూర్ణసౌమ్యం ఉన్నది. జ్ఞానాన్నికల బ్రహ్మాదిచేతనులకు జ్ఞానశూన్యాలకంటె ఉన్న ఒకే ఒక గొప్పతనం ఏమంటే – "వీటిని మనను అంతర్యామిగా ఉండి నడపించేవాడు సర్వేశ్వరుడే" అనే భావనను కల్గి ఉండడమే.

**ఒరు ముఱై**
**ఇరు శుడర్ మీదినిలయఙ్గా–ముమ్మది**
**ళిలఙ్గై ఇరుకాల్ వళైయ– ఒరు శిలై**
**యొన్ఱియ ఈరెయిఱ్ఱఴల్ వాయ్ వాళియిన్**
**అట్టనై.**

ప్రతి:– ఒరు ముఱై = శ్రీరాముడై అవతరించిన ఒక సమయంలో, ఇరు శుడర్ = చంద్రసూర్యులు (భయంవల్ల), మీదినిల్ ఇయఙ్గా=పైన సంచరించడానికి సాధ్యంకానిది,



ముమ్మదిళ్=జలదుర్గం, గిరిదుర్గం, వనదుర్గం–అనే మూడు దుర్గాలను కల్గినది అయిన, ఇలఙ్గై=లంకాపురిని, ఇరు కాల్ వళైయ=రెండు అగ్రాలను వంచిన, ఒరు శిలై=సాటిలేని శార్ఙ్గమనే వింటితో, ఒన్ఱియ ఈర్ ఎయిఱు=సంధించినది, రెండు దంతాలను కల్గినది, అఴల్ వాయ్=నిప్పును ఉమిసే నోటిని కల్గినది అయిన, వాళియిన్=బాణంతో, అట్టనై = భస్మం చేశావు.

**పెరియ–ప్రథమ:– (ఒరు ముఱై యిత్యాది) తానుణ్డాక్కిన పయిరుక్కు క్కళై పఱిప్పానుమ్ తానేయానాప్పోలే, సృష్టమాన జగత్తై అఴివుశెయ్యుమ్ రాక్షసరై నిరసిప్పానుమ్ తానే. (ఒరు ముఱై) ఒరు పర్యాయమ్. (ఇరు శుడర్) చన్ద్రాదిత్యర్‌కళ్. (మీదినిలియఙ్గా) మేలే సఞ్చరిక్క భయప్పడుమ్పడియాయ్. (ముమ్మదిళ్) గిరిదుర్గ–జలదుర్గ–వనదుర్గమెన్గిఱ మూన్ఱైయు ముడైత్తాన. (ఇలఙ్గై) నినైత్తార్ క్కఞ్జవేణ్డుమ్పడియాన రాక్షసర్, కుళవిక్కూడు శేర్న్దాప్పోలే శేర్న్దు అమ్మణక్కూత్తడిక్కుమ్ దేశమ్. (ఇరు కాల్ వళైయ యొరు శిలై యొన్ఱియ ఈరెయిఱ్ఱఴల్ వాయ్ వాళియిలట్టనై) ఇరణ్డు కోటియుమ్ వళైన్దునిఱ్కుమ్ ప్రధానమాన శ్రీశార్ఙ్గత్తిలే పొరున్ది ఇరణ్డెయిఱ్ఱైయుముడైత్తాయ్ నెరుప్పై యుమిఴానిన్ఱుళ్ళ శరత్తాలే శుట్టుప్పొకట్టాయ్. బ్రహ్మసృష్టియై ప్పోలన్ఱియే, పత్తుమ్బత్తాక అమ్బాలెతిర్‌త్తు, ప్పిరాట్టియినుడైయ సంశ్లేషవిరోధియై ప్పోక్కినాప్పోలే ఎన్నుడైయ విరోధికళైయుమ్ పోక్క వేణుమెన్ఱు కరుత్తు.**

**పెరియ–ద్వితీయ :– (ఒరు ముఱై యిత్యాది) పిరివుక్కు హేతుభూతనాన రావణనై యఴియచ్చెయ్‌తాళ్ పిరాట్టియో? నీయన్ఱో? ఒరుకాల్ చన్ద్రసూర్యర్‌కళుమ్‌కూడ మేలే సఞ్చరిక్కవు మఞ్జుమ్పడియాయ్, "కాట్టరణ్ – మలైయరణ్–నీరరణ్" ఎన్గిఱ మూన్ఱు వకైప్పట్ట అరణై యుడైత్తాయిరుక్కిఱ లఙ్కైయై విల్లినుడైయ కోటిద్వయముమ్ వళైయుమ్పడి అద్వితీయమాన శ్రీశార్ఙ్గత్తిలే పూట్టప్పట్టు, ఇరణ్డెయిఱ్ఱైయుముడైత్తాయ్, త్తొడుక్కుమ్బోతు అమ్బాయ్, ఎతిరికళ్ మేలే తైక్కుమ్బోతు నెరుప్పాయ్ త్తైక్కు మమ్బాలే ముడిత్తాయ్.**

(అడైన్ద విత్యాది) ఇవ్వాత్మావుక్కు స్వతస్సిద్ధ మల్ల. అయఃపిణ్డత్తైయుమ్, అగ్నియైయుమ్ శేర్‌త్తువైత్తాల్ అన్యోన్యసంయోగత్తాల్ అదినుడైయ పరమాణుక్కళ్ సూక్ష్మరూపేణ అచిత్తిలే వన్దు సంక్రమిక్కైయినాలేయాదల్, అన్ఱిక్కే, అదినుడైయ గుణత్తై భజిక్కైయినాలేయాదల్, అదినుడైయ ఔజ్జ్వల్యత్తైయుమ్, వర్ణత్తైయుముడైత్తా యిరుక్కుమాపోలే నిత్యమాన ఆత్మవస్తు అనాదియాయుళ్ళ అచిత్సంయోగత్తాలే అన్ద అచిత్తిలే అహమభిమానత్తై ప్పణ్ణుమ్పడి ఫలిక్కిఱ అవిద్యా–కర్మ–వాసనా–రుచికళ్, అవై యడియాక పరిగ్రహిత్త శరీరత్తైప్పఱ్ఱి వరక్కడవతాన అధి–వ్యాధి, నిషిద్ధానుష్ఠానమ్, ఇప్పడి కార్యమాయుమ్ అడి కాణవొణ్ణాతపడి కిడక్కిఱవై. పుదుప్పుడైవైయై యఴుక్కు

**క్కఴఱ్ఱయమాపోలే, క్రమత్తాలే పోక్కుకైయన్ఱిక్కే, ఒరుకాలే సవాసనమాక ప్పోక్కవేణ్డిల్ (నుడఙ్గిడై యిత్యాది)**

**అదుక్కు చ్చెయ్యవేణ్డువదెన్నెన్న, (నుడఙ్గిడైయై యిత్యాది) ప్రబలప్రతిబన్ధకఙ్గళై వరుత్తమఱ ప్పోక్కవల్లవనై ప్పఱ్ఱ వడుక్కుమ్. (నుడఙ్గిడైయై) కణ్డార్క్కు "ఎన్నాయ్ విళైయక్కడవదో?" ఎన్ఱు అఞ్జవేణ్డుమ్బడియాన సౌకుమార్యత్తైయుడైత్తాన ఇడైయైయుడై యవళైక్కిడీర్ పిరిత్తువైత్తదెన్నై. మున్బు లఙ్కైయిలే కొడుపుక్కు చ్చిఱైవైత్త రావణన్ మిడుక్కఴియుమ్బడియాక మేఘత్తిలే మిన్నినాప్పోలే అఴకియ తిరుక్కైయిలే శ్రీశార్ఙ్గత్తై వైత్తవన్. ఎదిరికళై యఴియచ్చెయ్కైక్కు ఒరు వ్యాపారమ్ పణ్ణవేణ్డా, కైయిలే విల్లై వాఙ్గవమైయుమ్. అఴకియ తిరుక్కైయిలే విల్లై ప్పిడిత్తవన్ ఉపాయమెన్నుదల్; "అవనై యుపాయమాక ప్పఱ్ఱుఙ్గోళే" ఎన్ఱు విధియాదల్.**

**"నుడఙ్గిడైయై మున్నిలఙ్గై వైత్తాన్" ఎన్ఱతుక్కు క్కరుత్తెన్నెన్నిల్, ఈశ్వరశేషమాన ఆత్మవస్తువై "ఎన్నదు" ఎన్ఱిరుక్కైయావదు పిరాట్టియై ప్పిరిత్త రావణనోడొక్కు మెన్నై. తన్నై ప్పఱ్ఱినార్క్కు అవళ్ విరోధియై ప్పోక్కినాప్పోలే విరోధియై ప్పోక్కి క్కొడుక్కు మెన్నై. అవళోడొత్త ప్రాప్తియుమ్ అవన్బక్కలివనుక్కుణ్డెన్నైయుమ్, అవనై ప్పఱ్ఱువార్ అవళ్ మున్నాక ప్పఱ్ఱువదెన్నైయుమ్. (ఒరు పేరున్ది యిత్యాది) ఇల్లాదత్తై యుణ్డాక్కిన ఉనక్కు ఉళ్ళదుక్కొరు గుణాధానమ్ పణ్ణుకై యరిదో వెన్నైయుమ్, పిరాట్టియోట్టై క్కలవిక్కు విరోధియాన రావణనై యఴియచ్చెయ్ద ఉనక్కు ఎన్నుడైయ ప్రతిబన్ధకమ్ పోక్కుకై యరిదో? వెన్నైయుమ్.**

**(వాళియిట్టలనై) బ్రహ్మసృష్టిపోలే సఙ్గల్పత్తాలే శెయ్కైయన్ఱిక్కే, నేర్కొడునేరే పూశలిలే నిన్ఱు అఴియచ్చెయ్దాయ్.**

**పెరియ-అను. :-** ఇక, ఆ తరువాత, తాను కృషి చేసే పైరుకు కృషీవలుడే కలుపును తీసినట్లు, సృష్టించిన లోకాలను నాశనం చేసే రాక్షసులను సంహరించేవాడు ఇతడే-అని అంటున్నారు **(ఇరు శుడర్ ఒరు ముఱై మీదినిల్ ఇయఙ్గా)** సూర్యచంద్రులు ఏ మాత్రంకూడా ఈ లంకపై సంచరించడానికి భయపడేటట్లు ఉన్నది. **"భీషోదేతి సూర్యః"** (పరమాత్మవలన కల భయంవల్ల సూర్యుడు ఉదయిస్తున్నాడు) అని అంటూ పరమాత్మవల్లకల భయంచేత క్రమం తప్పకుండా ఉదయించి, ఆకాశంలో సంచరించే సూర్యుడు కూడా **"నైనం సూర్యః ప్రతపతి"** (రా.బా.ల-15-10) (రావణుని సూర్యుడు తన కిరణాలతో తపించడంలేదు) అన్నట్లు రావణునివల్ల కల్గిన భయంచేత, లంకపై సంచరించే తన కిరణాలతో తాపం కల్గించడం లేదు అని చెప్పబడింది కదా! సూర్యునకు చెప్పిన న్యాయం చంద్రునకుకూడా వర్తిస్తుంది కాబట్టి, చంద్రసూర్యులు రావణునివల్ల భయంచేత ఒకసారికూడ లంకపై సంచరించలేదని అంటున్నారు.



**(మున్మదిళ్ ఇలఙ్గై)**- పర్వతదుర్గం, జలదుర్గం, వనదుర్గం-అనే మూడు విధాలైన దుర్గాలనుకల లంకను. **(ఇలఙ్గై)**- తలచినవారంతా భయపడేటట్లు క్రౌర్యాన్ని కల రాక్షసులు. కందిరీగలు గూడు కట్టుకొని కూడి ఉండేటట్లుగా చేరి ఉండే, రాత్రిపూట **"అమ్మణక్కూత్తు"**ను ఆడే దేశాన్నికదా నాశనం చేసినది. ఏ విధంగా నశింపజేశాడు? అంటే, **(ఇరుకాల్ వళైయ ఒరుశిలై ఒన్ఱియ ఈరెయిఱ్ఱ అఴల్ వాయ్‌వాళియిన్ అట్టనై)** రెండు పైకొనలలో వంగి ఉండే, సాటిలేని శార్ఙ్గమనే వింటిలో చేరి ఉన్నది అయిన, రెండు పళ్ళను కల్గినది, అగ్నిని వెదజల్లే బాణంతో దహించావు. **(అఴల్ వాయ్ వాళి)** ఆ బాణం సంధించేటపుడు బాణంగా తోస్తుంది. శత్రువులమీద పడేటపుడు అగ్నిలా వ్యాపిస్తుంది. **(వాళియిన్ అట్టనై)** **"అయనై ఈన్ఱనై"** అనే ప్రయోగంలో చెప్పబడ్డ బ్రహ్మసృష్టివలె సంకల్పంతో ఎదిర్చి, రావణుని చిత్రవధ చేశాడు-అని భావం. **(ఒరు ముఱై....అట్టనై)** తనను విడదీసిన పాపి అయిన రావణుని సంహరించినది పిరాట్టి కాదుకదా! నీవే కదా! ఆ రీతిలోనే, నన్ను నీ నుండి విడదీసే ఈ సంసారాన్ని, దానికి మూలం అయిన అవిద్యాకర్మవాసనారుచులను నేను పోగొట్టుకోలేను. నీవే పోగొట్టాలి-అని ఇచట భావం. ఈ అర్థానికి సంవాదంగా- **"అడైన్ద అరువినైయోడల్లల్ నోయ్ పావమ్ మిడైన్దవై మీణ్డొఴియవేణ్డిల్-నుడఙ్గిడైయ మున్నిలఙ్కై వైత్తాన్ మురణఴియ మున్నొరునాళ్ తన్ విల్ అఙ్కై వైత్తాన్ శరణ్"** (ముదల్ తిరు-59) అనే పాశురం అనుసంధేయం. **(అడైన్ద అరువినై....)**- **"అరువినై"** (కర్మ) మొదలైనవి ఈ ఆత్మకు సహజమైనవి కావు. ఇనుపగుండును నిప్పులో పెట్టి కాచినట్లయితే, ఆ రెండు ఒకదానితో వేఱొకటి చేరి ఉండడంవల్ల అగ్నిపరమాణువులు ఇనుముతో చేరడంవల్లనో, లేక, అగ్నిగుణాన్ని ఇనుము పొందడంవల్లనో ఇనుపగుండు అగ్నికాంతిని, వర్ణాన్ని పొంది ఉండేటట్లే, నిత్యమైన ఆత్మస్వరూపం అనాదిగా ఉన్న అచిత్సంయోగంవల్ల ఆ అచిత్తు అనే శరీరాన్నే తానుగా భావింపజేసే అవిద్య అనే అజ్ఞానం, దీనికి కారణం అయిన కర్మ,వాసన,రుచి మొదలైనవి అయిన ఇవే **"అరు వినై"**. **(అఴిక్క అరిదాన వినై)**- అనబడుతున్నాయి. **(అల్లల్ నోయ్)** ముందు చెప్పిన కర్మాదులతో ఏర్పడే శరీర సంబంధంచేత **"అల్లల్"** (ఆధి) అనబడే మనఃక్లేశం, **"నోయ్"** (వ్యాధి) అనబడే శరీరక్లేశం ఏర్పడుతాయి. **(పావమ్)**- ఈ శరీరంతో చేసే పుణ్యపాపరూపమైన పాపం. ముందు జన్మలోని శరీరాలద్వారా చేయబడ్డ కర్మలు **"అరు వినై"** అని చెప్పబడడంచేత ఈ శరీరంతో చేయబడే కర్మలే ఇక్కడ **"పావమ్"** అనే పదంచేత చెప్పబడుతున్నాయి. **(మిడన్దవై)**-ఈ విధంగా ఒకదానికి వేఱొకటి కార్యంగా అనాదికాలంగా అనువర్తించడంచేత ఆది కనబడనట్లు అత్యంతనిబిడంగా ఉన్న ఇవి. **(మీణ్డుమ్ ఒఴియవేణ్డిల్)** -కొత్తబట్టను తెల్లగా చేసేటట్లు అంచెలుగా చేయకుండ. పాతవస్త్రం, ముఱికిపోగొట్టగానే తెల్లగా అయేటట్లు, ఒకేసారి సవాసనగా వీటిని అన్నిటిని పోగొట్టాలని తలచినట్లయితే ఇందుకోసం చెయ్యవలసినది ఏది? అని అంటే, బలమైన

అంతరాయాలను సైతం అనాయాసంగా పోగొట్టగల్గినవానిని ఆశ్రయించాలి–అని ఇకపై అంటున్నారు. **(నుడఙ్గిడైయై)** ఊగిసలాడే నడుమునుకల సీతాదేవిని. చూచిన వారంతా, “శ్రీరాముని విశ్లేషించి ఈ విధంగా బాధపడే ఈ దేవికి ఏమి కానున్నదో? అని భయపడేటట్లు సుకుమారం అయిన నడుమునుకల ఈమెనుకదా ఈ పాపి విడదీశాడు–అని భావం. **(మున్ ఇలఙ్గై వైత్తాన్ మురణ్ అழియ)**–పూర్వం ఒకానొక సమయంలో లంకలోకి తీసికొని పోయి, చెఱలో ఉంచిన రావణుని బలం నశించేటట్లు. **(మున్ ఒరు నాళ్ తన్ విల్ అఙ్గైవైత్తాన్ శరణ్)**– మేఘంలో ఇంద్రధనుస్సు ఉన్నట్లు అందమైన చేతిలో వింటిని దాల్చిన ఇతడే. **(మిడన్దవై మీణ్డழియ)**– ఉపాయం కాగలడు. **(మురణ్ అழియ విల్ అఙ్గై వైత్తాన్)** –శత్రువులను నాశనం చేసే వింటిని ఎత్తి, నారిని కూర్చి, బాణాలను సంధించవలసిన పనిలేదు. వింటిని పట్టిన సన్నివేశంతోనే శత్రువులు మట్టి కఱిచేటట్లుండే వాడు–అని భావం. **(శరణ్)** వింటిని అందమైన చేతిలో దాల్చినవాడే ఉపాయం–అని కూడా చెప్పవచ్చు “ఇతనిని ఉపాయంగా ఆశ్రయించండి” అని ఇతరులకు విధించేటట్లు అని చెప్పవచ్చు. **“నుడఙ్గిడైయై మున్నిలఙ్గై వైత్తాన్”** అనే దానికి భావం ఏమి అంటే, భగవానునకు శేషభూతం అయిన ఆత్మవస్తువును మనం అనాదికాలంగా మనది అని భావించడం పిరాట్టిని విడదీసిన రావణుని కృత్యంతో సమానమైనది–అని తెలుపడమే. తనను ఉపాయంగా ఆశ్రయించినవారికి, పిరాట్టి విరోధి అయిన రావణుని నశింపజేసికొన్న ఆటంకాలను అన్నిటినీ పోగొట్టి, తనను అనుగ్రహిస్తాడని భావం. పిరాట్టితో సమానం అయిన సంబంధం ఈ జీవునకు సర్వేశ్వరునితో ఉన్నదని తెలుపడంకోసం, ఉపాయంగా అతనిని ఆశ్రయించేటపుడు పురుషకారస్వరూపిణి అయిన ఈమెను పురస్కరించుకొని ఆశ్రయించాలనే తెలుపడం కోసం **“నుడఙ్గిడైయై”** అని ప్రారంభించి, ఆమెనుగూర్చి తెలిపారు అని కూడా చెప్పవచ్చు.

**(ఒరు పేరున్ది)** అని ప్రారంభించి –**“ఇల్లై” (నాస్తి)** అనేటట్లున్న ఆత్మవస్తువునకు సత్త కలిగేటట్లు చేసిన నీకు, ఉన్న వస్తువైన నాకు ఒక గొప్పతనాన్ని కల్గించడం అరుదు కాదని తెలిపారు. **(ఒరు ముఱై)**– అని ప్రారంభించి– పిరాట్టితో సంశ్లేషించడానికి అడ్డుగా ఉన్న రావణుని నశింపజేసిన నీకు, నా అడ్డంకులను పోగొట్టడం అరుదు కాదు అని తెలుపుతున్నారు.

**మూవడి నా నిలమ్ వేణ్డి**
**ముప్పురి నూలొడు మూనురి యిలఙ్గు**
**మార్విన్ – ఇరు పిఱప్పు ఒరు మాణాకి**
**ఒరు ముఱై యీరడి మూవులకళన్దనై**

**ప్రతి:–** ఒరు ముఱై=ఒకానొక సమయంలో, ముప్పురినూలొడు=యజ్ఞోపవీతంతోకూడ, మాన్ ఉరి=కృష్ణాజినం, ఇలఙ్గు =ప్రకాశించే, మార్విన్=వక్షఃస్థలాన్నికల, ఇరు పిఱప్పు



ఒరు మాణ్ ఆకి=విలక్షణ బ్రాహ్మణ బ్రహ్మచారియై, (మహాబలివద్దకు పోయి), నా నిలమ్=భూమిలో, మూ అడి=మూడడుగుల నేలను, వేణ్డి=యాచించి, ఈర్ అడి=రెండు పాదాలతో, మూ ఉలకు=మూడులోకాలను, అళన్దనై=కొలిచావు.

**పెరియ–ప్రథమ :– (మూవడి యిత్యాది) అమ్బాలే సాధిక్కవొణ్ణాదవిడమ్ అఴకాలే సాధిత్తపడి శొల్లుకిఱదు. (మూ వడి నానిలమ్ వేణ్డి) నాలు వకైప్పట్ట భూమియిలే మూవడియై వేణ్డి. (ముప్పురినూలొడు మానురియిలఙ్గు మార్విల్) ఒరు కాళమేఘత్తిలే మిన్నలై ఏఱిట్టాప్పోలే తిరుయజ్ఞోపవీతముమ్, అత్తోడే కూడిన కృష్ణాజినముమ్ విళఙ్గానిన్ఱ తిరుమార్వైయుడైయైయాయ్. (ఇరుపిఱప్పు) ద్విజనుమాయ్. (ఒరు మాణాకి) ఒప్పిల్లాత శ్రీవామననాయ్, తానే యిన్ను మొరుకాల్ ఇవ్వడివు కొళ్ళవేణు మెన్నిలుమ్ ఇప్పడి వాయాద వడివైయుడైయనాయ్. (ఒరు ముఱై యీరడి మూవులకళన్దనై) ఒరు కాలిరణ్డడియాలే మూన్ఱు లోకత్తైయుమ్ అళన్దుకొణ్డాయ్. ఇత్తాల్ “ఇన్దిరనుక్కు రాజ్యత్తై మీట్టుక్కొడుత్తాప్పోలే ఎన్నుడైయ శేషత్వత్తైయుమ్ మీట్టు త్తన్దరుళ వేణుమ్” ఎన్గిఱార్. “తేవర్కళ్ శెన్ఱిరన్దార్ క్కిడర్ నీక్కియ కోట్టఙ్గై వామననాయ్” ఎన్ఱు ఉన్నై యిరన్దారిరప్పుక్కు నీయు మిరన్దు అవర్కళపేక్షితమ్ పారిక్కుమవనల్లైయో? ఇశైయాతార్ తలైకళిల్ వైత్త తిరువడికళై ఇశైన్ద వెన్తలైయిలే వైత్తాలాకాదో? ప్రయోజనాన్తరపరనుడైయ ఇఴవు తీర్త్త ఉనక్కు అనన్య ప్రయోజననాన వెన్నుడైయ ఇఴవు తీర్క్కలాకాదో? ఇన్దిరన్ కఴిఞ్జు మణ్ణన్ఱో? ఇఴన్దదు, నాన్ ఎన్నైయు మున్నైయు మన్ఱో? ఇఴన్దదు.**

**పెరియ–ద్వితీయ :– (మూవడి) అమ్బాలழిక్క (సాధిక్క) వొణ్ణాద విడత్తై (విడమ్) అఴకాలు, మిరప్పాలుమ్ అழియచ్చెయ్దపడి. ప్రయోజనాన్తరపరరాన ఇన్ద్రాదికళుడైయ కార్యమ్ శెయ్ద నీ ఉన్నైయే ప్రయోజనమాక నినైత్తిరుక్కిఱ కార్యమ్ శెయ్యలాకాదో?**

**(మూవడినాల్ నిలమ్ వేణ్డి) ఈరడియాలే భూమి యళన్దు ఓరడిక్కు అవనై చ్చిఱైయిట్టువైక్క నినైత్తు మూన్ఱడియై యిరన్దానాయిఱ్ఱు. నెయ్తల్, మరుతమ్, ముల్లై, కుఱిఞ్జి–యెన్ఱాప్పోలే శొల్లుకిఱ అన్నలుమ్, తున్నలుమాన భూమియై యర్థిత్తు. ఇన్నాలిలుమ్ ఋజీషాంశమాయ్ క్కழిత్తదు పాలైనిల మెన్ఱు శొల్లువర్కళ్. ఇవర్క్కభిమతముమ్ నాలెన్ను మిడమ్ తోఱ్ఱియిరున్దదితే.**

**(ముప్పురి యిత్యాది) మేఘత్తిలే మిన్నినాప్పోలే శాత్తిన యజ్ఞోపవీతముమ్, కృష్ణాజినముమ్, విళఙ్గానిన్ఱుళ్ళ తిరుమార్వైయుడైయైయాయ్, ఉపనయనమ్ పణ్ణిన పుతుమై తోఱ్ఱుమ్బడి యిరుప్పాయుమాయ్, ఇన్దిరనుడైయ అర్థిత్వమ్ తలైక్కట్టుకైక్కాక, ఇట్టపోదోడు ఇడాదపోదోడు వాశియఱ ముకమలర్న్దు పోమ్బడి ఇరుప్పిలే తకణేఱిన వామనవేషత్తై ప్పరిగ్రహిత్తు, ఒరుకాల్ త్రైలోక్యత్తైయుమ్ ఈరడియాలే అళన్దుకొణ్డాయ్. ఆశైయిల్లాదార్ తలైమేలేయుమ్ వైక్కుమ్ తిరువడికళై ఆశైయుడైయ వెన్తలైయుమ్**

వైక్కలాకాదో? ఇన్ద్రనైప్పోలే కఴిఞ్జ మణ్ పెఱుతల్, మహాబలియైప్పోలే ఔదార్యమ్ కొణ్డాడుతల్ శెయ్యవిరుక్కిఱేనో? ఉన్నై ప్పెఱవేణుమెన్ఱన్రో? నానర్థిక్కిఱదు, ఉన్నైవైత్తు వేఱొన్రై యిరన్దార్క్కో నీ ఇరప్పాళనాయ్ క్కార్యమ్ శెయ్వదు ? ఉన్నైయే యిరన్దార్ కార్యమ్ శెయ్యలాకాదో? **"మదీయమూర్ధాన మలఙ్కరిష్యతి కదా"** ఎన్ఱిఱే నానిరుక్కిఱదు.

**అరు:- (నానిలమ్) - గిరి, వనమ్, ద్వీపమ్, సముద్రమ్. ఆక నాలువకైప్పట్ట పూమి.**

**పెరియ-అను** :- ఇక, రావణుని సంహారంలోవలె బాణప్రయోగాన్ని చేయడానికి వీలులేనపుడు, అందంతో, శీలగుణంతో, దాసుల కార్యాన్ని చేస్తాడు-అని తెలుపుతున్నారు. **(మూవడి...)** మిగిలిన ఫలాలను కోరే ఇంద్రుడు మొదలైనవారి కార్యాన్ని చేసిన నీవు, నీ ఫలంగా తలచే నా కార్యాన్ని చేయరాదా! **(నాల్ నిలమ్ మూవడి వేణ్డి) ముల్లై, కుఱిఞ్జి, మరుతమ్, నెయ్దల్"** - అని చెప్పబడే నాల్గువిధాలుగా ఉన్న అల్పరసమైన భూమిలో రెండు శ్రీపాదాలతో లోకాలను కొలిచి. మూడవపాదంతో అతనిని (బలిని) చెఱబట్టాలని భావించి, మూడడుగుల నేలను యాచించాడు. అరణ్యం, తత్పరిసరప్రాంతాలు ముల్లై. పర్వతాలు, వానిని చేరి ఉన్న ప్రదేశాలు కుఱిఞ్జి. జనపదాలు, తత్పరిసరప్రాంతాలు మరుతమ్. సముద్రతీరం, తత్పరిసరప్రాంతాలు నెయ్దల్. **"నా నిలమ్ వాయ్కొణ్డు నన్నీర్ అఱమెన్ఱు కోదుకొణ్డ వేనిల్ అఞ్జెల్వన్ శువైత్తు ఉమిழ்ந்த పాలై"** (తిరువిరు-26) (ముల్లై, కుఱిఞ్జి, మరుదమ్, నెయ్దల్ - అనే నాలుగు ప్రదేశాలను తన కిరణాల ద్వారా ముఖంలో గ్రహించి వాటిలోని సారమైన నీటిభాగాన్ని హరించి అసారమైన భాగం ఇది - అని తెలిసిన, వేడిమిని సంపదగా కల సూర్యుడు రుచిచూసి వదలిపెట్టిన ఎడారిప్రాంతాన్ని) అనే రీతిలో పై నాల్గు విధాలైన ప్రాంతాలు తీవ్రమైన ఎండలు మొదలైనవాని కారణంగా తమ తమ స్వభావాలను కోల్పోయి నిష్ఫలమైన పాలైప్రాంతాలుగా (ఎడారి ప్రాంతాలుగా) అవుతాయి అని అంటారు. ఈ రీతిలో ఎడారిప్రాంతానికి ప్రత్యేకమైన స్థితిలేనందువల్ల **"నానిలమ్"** అని అంటూ కవులు ప్రయోగించే రీతిని బట్టి ఈ ఆழ்వార్లు కూడా **"నానిలమ్"** అని అంటూ భూమిని నిర్దేశించారు. **(ముప్పురినూలొడు మానురి ఇలఙ్గు మార్వినిల్)**- ఒక నీలమేఘంలో మెఱపు తీగ ప్రకాశించే రీతిలో అలంకరించుకున్న యజ్ఞోపవీతం, దానితో చేరి ఉన్న కృష్ణాజినం ప్రకాశించే వక్షఃస్థలాన్ని కలవాడై. **(ఇరు పిఱప్పు)**- రెండవ జన్మను ఇచ్చే ఉపనయనం చేసిన కొత్తదనం ప్రకాశించేవాడై. **(ఒరు మాణ్ ఆకి)** సాటిలేని బ్రహ్మచారియై. ఇంద్రుడు కావాలని యాచించిన భూమిని అతని కోసం సంపాదించి, ఇవ్వడంకోసం భిక్షను పెట్టిన సమయంలోను, పెట్టని సమయంలోను తేడా లేకుండా ముఖం వికసించి ఉండేటట్లు యాచనలో ఆరితేరిన సాటిలేని వామనబ్రహ్మచారి వేషాన్ని ధరించాడని భావం. తానే ఇంకొకసారి ఈ రూపాన్ని ధరించాలని అనుకున్నా ఈరీతిలో సాధ్యం కాదు అన్నట్లున్న సాటిలేని రూపసౌందర్యాన్ని (**'ఒరు'** అనే పదం) తెలుపుతున్నది.



**(ఒరు ముఱై ఈరడి మూవులకు అళన్దనై)** ఒకే సమయంలో రెండు పాదాలలో మూడు లోకాలను కొలిచినవాడవు. ఈ రీతిలో పల్కడంద్వారా "ఇంద్రునకు అతడు కోఱిన త్రైలోక్యరాజ్యాన్ని తిరిగి అనుగ్రహించినట్లే నాకు నేను కోరే శేషత్వసామ్రాజ్యమనే పదవిని అనుగ్రహించాలి" అనే భావాన్ని వ్యక్తం చేశారు. **"ఈట్టఙ్గొళ్ దేవర్కళ్ శెన్ఱు ఇరన్దార్క్కు ఇడర్ నీక్కియ కోట్టఙ్కై వామనన్"** (తిరువాయ్-7-5-6) (గుంపులు గుంపులుగా చేరి వెళ్ళి ప్రార్థించిన దేవతలను అనుగ్రహించి వారి ఆపదలను తీర్చినవాడు, దానజలాన్ని గ్రహించడం కోసం తన రెండు చేతులను దోసిలిగా కలిపినవాడైన వామనుడు) అని అంటూ నిన్ను యాచించిన వారికోసం నీవుకూడా యాచకుడవై వారి కార్యాన్ని నిర్వహించేవాడవయ్యావు. అన్యఫలాలను యాచించే ఇంద్రుని కోఱికను తీర్చిన నీకు నిన్నే ప్రాప్యంగా గ్రహించిన నా కోఱికను తీర్చడం సాధ్యంకాదా! ఇంద్రుడు అసారమైన భూమినికదా యాచించాడు. నేను నిన్నుకదా కోల్పోయి ఉన్నాను. ఆశలేనివారి తలపైన కూడా పెట్టే శ్రీపాదాలను ఆశను కల నా తలపై పెట్టరాదా! ఇంద్రునివలె అల్పమైన భూమివిషయంలో ఆశనో, లేక మహాబలివలె "ఔదార్యంలో సాటిలేనివాడు" అనే ఔదార్య గర్వాన్నో కల్గి ఉన్నవాడను కాను నేను. నిన్ను పొందాలని కదా నేను ఆశపడుతున్నాను. నిన్ను కాదని వేఱొకదానిని ఆశపడేవారికే నీవు యాచకుడవై కూడా కార్యాన్ని చేస్తావా? నిన్నే ఆశపడేవారి కార్యాన్ని చేయవా? **"అడిచ్చియోమ్ తలమిశై నీ అణియాయ్ ఆழிయఙ్కణ్ణా ఉన్ కోలప్పాదమ్"** (తిరువాయ్ 6-3-6) (అందమైన నేత్రాలను కల స్వామీ! దాసులమైన మా శిరస్సులపై నీ అందమైన పాదాన్ని అలంకారంగా పెట్టు), **"పడిక్కళవాక నిమిర్త్త నీ పాదపఙ్కయమే తలైక్కణియాయ్"** (తిరువాయ్-9-2-6) (భూమిని కొలిచిన నీ పాదపద్మాలను మా తలకు అలంకారంగా అనుగ్రహించు), **"కదా పున శ్శంఖరథాంగకల్పకధ్వజారవిందాంకుశవజ్రలాంఛనమ్, త్రివిక్రమ! త్వచ్చరణాంబుజ ద్వయం మదీయమూర్ధాన మలంకరిష్యతి"** (స్తో.ర-31) (త్రివిక్రమా! శంఖం, చక్రం, కల్పవృక్షం, ధ్వజం, తామరపూవు, అంకుశం, వజ్రం-అనే వీటిని గుర్తులుగా కల నీ శ్రీపాదద్వంద్వం నా తలను ఎపుడు అలంకరించబోతుందోకదా!) అని నీ పాదద్వంద్వాన్ని శిరసావహించాలని కదా నేను ఆశపడుతున్నాను-అనే భావం కూడా స్ఫురిస్తున్నది.

**నాఱ్ఱిశై నడుఙ్గ వఞ్జిఱై ప్పుఱవై**
**యేఱి-నాల్ వాయ్ ముమ్మద త్తిరుశెవి**
**ఒరు తని వేழ్త్తరన్దైయై-ఒరు నా**
**ళిరు నీర్ మడువుళ్ తీర్త్తనై**

ప్రతి:- ఒరు నాళ్=ఒకానొక సమయంలో, నాల్ తిశై నడుఙ్గ=నాల్గుదిక్కులలో ఉండే వారంతా భయపడేటట్లు, (గొప్ప కోపావేశాన్ని ఆరోపించుకొని,) అమ్ శిఱై పఱవై

ఏఱి=అందమైన ఱెక్కలను కల గరుడునిపైకి ఎక్కి, ఇరు నీర్ మడువుళ్=లోతైన నీరును కల మడుగు తీరానికి వేంచేసి, నాల్ వాయ్=వేలాడే తొండాన్ని, ముమ్మదమ్=మూడుచోట్ల నుండి స్రవించే మదాన్ని, ఇరు శెవి=రెండు చెవులనుకల, ఒరు తని వేఴత్తు= పరమవిలక్షణమైన గజేంద్రుని, అరన్దైయై=దుఃఖాన్ని, తీర్త్తనై=పోగొట్టావు.

**పెరియ–ప్రథమ :–** (నాఱ్ఱిశైయిత్యాది) పెరుమదిప్పరాన ఇన్ద్రాదికళుక్కేయో అపేక్షితమ్ శెయ్దదెన్నిల్, అన్ఱు, ఆపత్తుమ్, విశ్వాసముమ్ ఎన్గిఱదు అల్పముణ్డానాల్, తాన్ తణ్ణియరాన తిర్యక్కుక్కళుక్కుమ్ శెయ్యు మెన్గిఱదు. (నాఱ్ఱిశై నడుఙ్గ) శ్రీగజేన్ద్రాఴ్వానుడైయ అపత్తై నినైత్తు క్కలఙ్గిన కలక్కత్తై క్కణ్డు "జగత్తుక్కు ఎన్న మిఱుక్కు ప్పుకుకిఱదో?" ఎన్ఱు అఱియాదే నడుఙ్గ, (అమ్శిఱై ప్పఱవై యేఱి) మిక్క వఴకైయుమ్, వేగత్తైయుముడైత్తాన శిఱకై యుడైత్తాన పెరియతిరువడిమేలే యేఱి. (నాల్ వాయ్ ముమ్మద త్తిరుశెవి యొరు తని వేఴత్తరన్దైయై) నాలానిన్ఱ వాయైయుమ్, మూన్ఱు మదత్తైయుమ్ ఇరణ్డు శెవియైయుముడైత్తాయ్, వేఱు తుణైయిన్ఱిక్కే తన్ మిడుక్కఱ్ఱు నిన్ఱ ఆనైయినుడైయ దుఃఖత్తై. అరన్దై–దుఃఖమ్. (ఒరునాళిరునీర్ మడువుళ్ తీర్త్తనై) అద్దశైయిలే వేఱ్ఱునిలమాయ్ ప్పెరియనీర్ వెళ్ళమాన మడువిలే తీర్త్తాయ్. "ముదలైయిన్ వాయిలే నిన్ఱుమ్ ఆనైయై మీట్టాఱ్పోలే సంసారమ్ కొణ్డ వెన్నైయుమ్ మీట్కవేణుమ్" ఎన్గిఱార్. "గజ ఆకర్షతే తీరే గ్రాహ కర్షతే జలే, తయో ర్ద్వన్ద్వసమం యుద్ధం దివ్యం వర్షసహస్రకమ్" ఎన్ఱు ఆనైక్కు క్కాల మల్పమ్, ఎన్నుడైయ కాల మనాది. ఆనైక్కు ముదలై యొన్ఱు, ఎనక్కు ముదలై యైన్దు. అదు మిడుక్కనాన యానై, నాన్ దుర్బల నెన్గిఱార్.

**పెరియ–ద్వితీయ :–** పెరుమదిప్పరాన ఇన్ద్రాదికళుక్కాక ఉన్నై యఴియమాఱి క్కార్యమ్ శెయ్దవళవేయో? జన్మవృత్తాదికళాల్ కుఱైయనిన్ఱ అనై ఇడర్పట్ట మడువిన్ కరైయిలే అరైకులైయ త్తలైకులైయ వన్దు విఴున్దవనన్నో?

(నాఱ్ఱిశై యిత్యాది) జగత్సృష్ట్యాదికళుక్కుమ్ సఙ్కల్పిత్తదుక్కు అవ్వరుకుణ్డెన్ఱఱియామైయాలే "జగదుపసంహారత్తుక్కుమ్ అవ్వరుకాయిరున్దదో! ఇదొరు శీఱ్ఱ మిరున్దపడియెన్!" ఎన్ఱు ఇరున్దదే కుడియాక ఎల్లారు మఞ్జుమ్బడియాక. మేరువుక్కినియ మేఘమ్బోలే అఴకియ శిఱకైయుడైయ పెరియతిరుత్తోళిలే యేఱి పెరియవేగత్తోడే, నాలా నిన్ఱుళ్ళ వాయైయుడైత్తాయ్, మూన్ఱు వకైప్పట్ట మదత్తై యుడైత్తాయ్, ఇరణ్డు శెవియై యుడైత్తాయ్, వేఱు తుణైయిన్ఱిక్కే అద్వితీయమాయిరుక్కిఱ ఆనైయుడైయ దుఃఖత్తై అద్దశైయిలే వేఱ్ఱునిలమాయ్ మిక్క వెళ్ళత్తై యుడైత్తాన మడువిలే అరైకులైయ త్తలైకులైయ వన్దు విఴున్దు పోక్కినాయ్.

"గ్రాహం చక్రేణ మాధవః". మడువిలే పోయ్ప్పుక్కు ఆనైయైయుమ్, ముదలైయైయుమాక వణైత్తుక్కొణ్డు పోన్దు కరైయిలే యేఱి ఆనైక్కు నలివు వారాదపడి



తిరువాఴియాలే ముతలైయై క్కీఱి ప్పొకట్టానాయిఱ్ఱు. "రాజపుత్రనోడు వినై యుణ్డ కైక్కూట్టనుక్కుమ్ పాల్తిరళై యిడక్కడవదుకాణ్" ఎన్ఱు భట్టరరుళిచ్చెయ్యుమ్బడి. "నాల్వాయ్ ముమ్మద త్తిరుశెవి యొరుతని వేఴత్తరన్దైయై" ఎన్గాఱ్పోలే శొల్లువదుక్కు క్కరు త్తెన్నెన్నిల్, ప్రజై కిణఱ్ఱిలే విఴున్దాల్ 'కాదుమ్ కణ్డవాళియుమ్ కాలుమ్ తలైయుమ్ వడివు మిరుక్కుమ్బడి కాణ్" ఎన్బారైప్పోలే ఇడర్పట్ట విదినుడైయ వవయఙ్గళవనుక్కు ఆకర్షకమానపడియాలే శొల్లుకిఱదు.

(వేఴత్తరన్దైయై) ఎళియరాయిరుప్పార్ నోవుపట్టాఱ్పోలన్ఱిఱే ఇతినుడైయ నోవుపాడు. "పరమాపద మాపన్నః". సర్వేశ్వరన్ తన్నై వ్వేణాతే వన్దు విఴవేణ్డుమ్బడి కరై పురణ్డ వాపత్తాయిఱ్ఱు. ఇవ్వాపత్తు క్కవధియెన్నెన్నిల్, (మనసాఽచిన్తయత్) వాయాల్ కూప్పిడుమదోవిఱ్ఱు. (ఒరు నాళిరునీర్ మడువుళ్ తీర్ త్తనై) అఙ్గు, కాల మళవిట్టిరుక్కుమ్, ముతలై యొన్ఱు, తాన్ ఆనై. ఇఙ్గో వెన్నాల్, కాల మనాది, ఇన్ద్రియఙ్గళైన్దు, నానో దుర్బలన్ ఆనాల్ వాశి పార్త్తు త్తరవేణ్డావో? (కాలైక్కతు విడుకిన్ఱ కయలొడువాళై విరవి) ఆన్తరాళర్ కుడియిలే పిఱన్దు ఈశ్వరన్ మర్మజ్ఞై యాయిరుప్పాళొరుత్తివార్త్తై ఒరు నీర్ప్పుఴు నలియ ప్పొఱుక్కమాట్టాతవన్. ఇరణ్డుకిడాయ్ కాలైప్పఱ్ఱి నలికిఱదెన్గిఱార్.

అరు:– (వేఴత్తు–అరన్దై) – అరతి–దుఃఖమ్. (ముమ్మదమ్)– కపోల మేఢ్రస్థలత్రయమ్.

**పెరియ–అను :–** ఇక, గొప్ప జ్ఞానాన్ని, శక్తిని కల ఇంద్రుడు మొదలైనవారికి మాత్రమే తనను అధఃకరించుకొని అయినా వారి పనిని చేస్తాడా ఏమి! అనే ప్రశ్న తోచినపుడు, ఆ విధంగా కాదు; ఆపద, విశ్వాసం ఏ కొంచెం అయినా ఉంటే, జన్మ, వృత్తం మొదలైన వానిలో చాలా తక్కువ అయిన తిర్యక్కులకు కూడా అవి ఉన్నచోటికి తానే నేరుగా ససంభ్రమంగా (**"అరై కులైయ త్తలై కులైయ"** – నడుములోని వస్త్రం జారిపోయేటట్లు, జుట్టుముడి వీడిపోయేటట్లు) పరుగెత్తి వచ్చి, కార్యాన్ని సఫలం చేస్తాడు సుమా– అని సమాధానంగా అంటున్నారు **(నాల్ తిశై నడుఙ్గ)** గజేంద్రుని ఆపదను చూచి నీవు పొందిన గొప్ప కలతను గమనించి "నీకేమి కాబోతున్నదో! ఏమో!" అని తెలియక భీతిల్లే నాల్గు దిక్కులలోని దేవతలు, మానవులు మొదలైన వారందరు భయపడ్డారు. లోకాన్ని అంతటిని సృష్టించేటపుడువలె సంహరించేటపుడుకూడ సంకల్పంతోనే సంహరించడాన్ని, కోపం లేకుండా ఉండడాన్ని చూచిన నాల్గు దిక్కులలోని బ్రహ్మాదిచేతనులు అందఱు ఈ తీవ్రమైన కోపాన్ని చూచి అయ్యో! లోకాన్ని అంతటిని సంహరించేటపుడుకూడ కన్పించని కోపంలా ఇది ఉన్నదే! ఈ విధమైన కోపంవల్ల ఏమి మూడుతుందో ఏమో?" అని భయపడేటట్లు–అని భావం. **(అఞ్జిఱై పఱవై ఏఱి)** ఎఱ్ఱని బంగారుకొండ అయిన మేరుపర్వతంపైన కాలమేఘం అధిరోహించి వచ్చేటట్లు, గొప్ప అందాన్ని, వేగాన్నికల గరుడుని భుజాలపై ఎక్కి, అత్యంతసంభ్రమంతో పరుగెత్తి

రావడాన్నిగూర్చి ఇక్కడ తెలుపుతున్నారు. ఈ విధంగా పరుగెత్తి వచ్చి, సాధించిన కార్యమేమో తెలుపుతున్నారు. **(నాల్ వాయ్ ముమ్మదత్తు ఇరు శెవి ఒరు తని వేழత్తు అరన్దైయై)** తొండాన్ని పైకెత్తి ఆక్రోశించినందువల్ల కిందకు వేలాడుతున్న నోటిని కల్గినదై, రెండు కర్ణాలు, మర్మాంగం-అనే మూడు అవయవాల నుండి స్రవిస్తున్న మదజలాన్ని కల్గినదై (రెండు, లేక పెద్దదైన) చెవులను కల్గినదై, వేఱొక సహాయం లేనిదై, తన బలం క్షీణించినందువల్ల నిస్సహాయస్థితిలో ఉన్న, ఆ అద్వితీయమైన గజేంద్రుని గొప్ప దుః ఖాన్ని, **(అరన్దై-అరతి-తున్బమ్-అంటే దుఃఖం) (ఒరు నాళ్ ఇరు నీర్ మడువుళ్ తీర్త్తనై)** సాటిలేని, అద్వితీయమైన దినంలో భక్తుడైన గజేంద్రునకు పరస్థానమై, అతని శత్రువు అయిన మొసలికి స్వస్థానమై, జలపౌష్కల్యాన్ని కల ఆ మడుగుతీరంలో ఆపద తీవ్రతను చూచి నడుములోని వస్త్రం జారగా, జుట్టుముడి వీడిపోగా పరుగెత్తి వచ్చి, గజేంద్రుని దుఃఖాన్ని తీర్చావు. **(ఒరు నాళ్)** ఈ విధంగా భగవానుని పరుగెత్తి వచ్చేటట్లు చేసిన అది కూడా ఒక కాలమేనా! అని అంటూ ఆ దినాన్ని ఆழ్వార్లు ప్రశంసిస్తున్నారు – **"ఒరు"** అనే విశేషణంద్వారా. "మొసలి నోటినుండి ఏనుగును విడిపించినట్లే, సంసారం నోటిలో చిక్కుకొని ఉన్న నన్ను కూడా విడిపించాలి" అని ఆழ్వార్ల హృదయం. **"గజ ఆకర్షతే తీరే గ్రాహ ఆకర్షతే జలే, తయో ర్ద్వంద్వసమం యుద్ధం దివ్యం వర్షసహస్రకమ్"** (గజం తీరానికి లాగుతున్నది. మొసలి నీటిలోనికి లాగుతున్నది. ఈ విధంగా ఆ ఇద్దఱికి దేవమానం ప్రకారం వేయి సంవత్సరాల కాలం ద్వంద్వయుద్ధం సమంగా జరిగింది.) (విష్ణు ధర్మం-69) అన్నట్లు గజేంద్రునకు విరోధి అయిన మొసలి ఒకటి (కాని), నాకు విరోధులైన ఇంద్రియాలు అనే మొసళ్ళు అయిదు. అది బలం కల ఏనుగు. నేను బలం లేనివాడను. అది కొంతకాలమే బాధపడింది. నేను అనాదికాలంగా బాధపడుతున్నాను. నన్ను రక్షించడం కోసం ఆ విధంగానే పరుగెత్తి రావద్దా స్వామీ!-అని అంటున్నారు.

**(వేழత్తరన్దైయై ఇరు నీర్ మడువుళ్ తీర్త్తనై) "గ్రాహం చక్రేణ మాధవః"** (విష్ణుధర్మమ్) (మొసలిని మాధవుడు చక్రంతో ఖండించాడు) అన్నట్లు మిక్కిలి త్వరగా మడుగు వద్దకు చేరి, ఏనుగును, మొసలిని పట్టుకొని తీరానికి తీసికొనివచ్చి ఏనుగు కాలిగోరుకు కూడ గాయం కాని రీతిలో అతిజాగ్రత్తగా సుదర్శనచక్రాన్ని ప్రయోగించి, మొసలిని ఖండించివేశాడు. భాగవతవిరోధి అయిన మొసలినికూడ దగ్గరకు తీసికొని తీరానికి చేర్చాలా? అని అంటే, రాజకుమారునకు మల్లయుద్ధాభ్యాసాన్ని చేయించడంకోసం అతనితో దినమంతా కలిసి పోరాడే మల్లయుద్ధవీరునకుకూడా పాలకోవముద్దలను తినిపించి, పెంచినట్లే, ఇది కూడా. గజేంద్రునితో పోరాడిన మొసలికి కూడా భగవానునిచే దగ్గఱకు తీసికొనబడే ఈ ఫలం లభించింది" అని భట్టర్ చమత్కరిస్తూ అనుగ్రహించారట. **(నాల్ వాయ్ ముమ్మదత్తు ఇరు శెవి ఒరు తని వేழత్తు)**-అంటూ ఏనుగుయొక్క ప్రత్యవయవాన్ని, సముదాయశోభను (సౌందర్యాన్ని, లావణ్యాన్ని) వర్ణించడంలో ఏం



తాత్పర్యం? అని అంటే, నూతిలోపడ్డ బిడ్డను గట్టుకు చేర్చి కాపాడినవారు "ఆహా! ఈ బిడ్డ చెవులు ఎంత అందమైనవి? కంఠం సన్నివేశం ఉన్న తీరు ఏమి? కాలు అందం ఎంతటిది? తల ఎంత అందమైనది? ఈ రూపసౌందర్యాన్ని వర్ణించడానికి సాధ్యం కాదే! చనిపోయే ఈ బిడ్డను అదృష్టవశంచేత కాపాడగల్గినామే!" అంటూ ఒక్కొక్క అవయవం యొక్క అందాన్ని, సముదాయశోభను మాటిమాటికి వర్ణించి చెప్పినట్లే ఇదికూడా. భగవానుడు బాధపడే ఏనుగును కాపాడినవెంటనే దాని ఒక్కొక్క అవయవంలోను, సముదాయశోభలోను అభినివేశాన్ని పొందడాన్ని తెలుపుతున్నది. **(వేழత్తు అరన్దైయై)** –చిన్న శరీరాన్ని కలవారి బాధవలె చిన్న బాధగా కాకుండా "వేలుకు తగిన వాపు" **(విరలుక్కు త్తకున్ద వీక్కమ్)** ఏనుగుకు తగిన వాతం **(యానైక్కు త్తకున్ద వాతమ్)** అని చెప్పేరీతిలో, ఈ ఏనుగు పెద్ద శరీరానికి తగిన గొప్ప బాధ-అని భావం. **"పరమాపద మాపన్నః మనసాఽ చింతయ ద్ధరిమ్"** (గొప్ప ఆపదను పొందిన గజేంద్రుడు హరిని మనస్సుతో ధ్యానించాడు) (విష్ణుధర్మమ్) అంటూ మహర్షి దీని ఆపదలోని తీవ్రతను సూచించారు. సర్వేశ్వరుడు తన గొప్పతనాన్ని చూడకుండా మడుగుతీరానికి వచ్చి పడేటట్లు పూర్ణమైన ఆపద అనే విషయాన్ని **"పరమాపత్"** అనే పదంద్వారా మహర్షి తెలియజేశారు. **(మనసాఽ చింతయత్)** అని అంటూ "మనస్సులో తలచాడు" అని అనడంవల్ల నోటితో పిలువడానికికూడా శక్తిలేక, మనస్సుతో ఉపాయంగా భావించే స్థితిని గజేంద్రుడు పొందడానికి తెలిపారు. **(ఒరు నాళ్....తీర్త్తనై)** భగవానునకు అంతరంగులైన పెరియాழ్వార్లు పొంది, పెంచిన కుమార్తెయై, భగవానుని మనస్సు దేనిని చెప్పినట్లయితే కరుగుతుందనే మర్మాన్ని గ్రహించిన ఆణ్డాళ్ **"కాలైక్కదు విడుకిన్ఱ కయలొడు వాళై విరవి"** (నాయ్చ్చి-3-5) (సొఱచేపలు, బేడిస చేపలు కలసి మా కాళ్ళను కరుస్తున్నవి) అని అంటూ "ఒక నీటిలో జీవించే ప్రాణి అయిన మొసలి గజేంద్రుణ్ణి బాధించడాన్ని సహించలేని నీవు రెండు రెండు చేపలు నా కాలును కఱవడాన్ని సహించవచ్చునా?" అని అన్నట్లు, "ఒక మొసలి బలిష్ఠుడైన గజేంద్రుణ్ణి కొంతకాలం బాధించడాన్ని సహించలేనివాడు, అయిదు ఇంద్రియాలు అనే మొసళ్ళు అనాదికాలంలో బలహీనుడను అయిన నన్ను బాధించడాన్ని సహించవచ్చునా? అంతకంటె వేగంగా పరుగెత్తివచ్చి రక్షించపద్దా?" అనే భావాన్ని ఆழ్వార్లు సూచించారు.

**ముత్తీ**
**నాన్మఱై ఐవకై వేళ్వి-అఱుతొழిల్**
**అన్దణర్ వణఙ్గుమ్ తన్మైయై**

**ప్రతి:-** ముత్తీ=త్రేతాగ్నులను, నాల్ మఱై=నాల్గువేదాలను, ఐ వకై వేళ్వి=అయిదువిధాలైన యజ్ఞాలను, అఱు తొழిల్=షట్కర్మలను కలవారైన, అన్దణర్=బ్రాహ్మణులచేత, వణఙ్గుమ్ తన్మైయై = నమస్కరింపబడే స్వభావాన్ని కల్గిఉన్నావు.

**పెరియ-ప్రథమ :- (ముత్తీ యిత్యాది) ఉపాయాన్తరనిష్ఠర్క్కుమ్ అవఱ్ఱై నడత్తిక్కొడుప్పతియితే, "యోగో యోగవిదాం నేతా" ఎన్గిఱపడియే. (ముత్తీ) మూన్ఱు పిళ్ళై పెఱువారైప్పోలే గార్హపత్య -ఆహవనీయ-దక్షిణాగ్నికళైయుమ్. (నాన్ మఱై) ఋగజుస్సామాథర్వణఙ్గళైయుడైయరాయ్. (ఐవకై కేళ్వి) "దేవయజ్ఞః పితృయజ్ఞో భూతయజ్ఞో మనుష్యయజ్ఞో బ్రహ్మయజ్ఞః" ఎన్నుమ్ పఞ్చమహాయజ్ఞఙ్గళైయుమ్. ఇత్తాల్ కర్మయోగమ్ శొల్లిఱ్ఱు. (అఱు తొழிల్) యజనమ్-యాజనమ్, అధ్యయనమ్-అధ్యాపనమ్, దానమ్ -ప్రతిగ్రహమెన్గిఱ షట్కర్మఙ్గళైయు ముడైయరాన. (అన్దణర్ వణఙ్గుమ్ తన్మైయై) అనన్యప్రయోజనరాన బాహ్మణరాలే ఆశ్రయిక్కప్పడుమ్ స్వభావత్తైయుడైయైయాయ్.**

**పెరియ-ద్వితీయ :- (ముత్తీ యిత్యాది) వర్ణఙ్గళిల్ ఉత్కృష్టవర్ణమాయ్, నల్ వழி పోకక్కడవదా యిరుక్కుమ్ బ్రాహ్మణజాతిక్కడైయ ఆశ్రయణీయనా యిరుక్కుమ్బడియై చ్చొల్లుకిఱదు. (ముత్తీ యిత్యాది) మూన్ఱుపిళ్ళై పెఱ్ఱ తాయైప్పోలే "ఆహవనీయ-గార్హపత్య-దక్షిణాగ్ని" ఎన్గిఱ అగ్నిత్రయముమ్, నాలువకైప్పట్ట వేదఙ్గళుమ్, పఞ్చమహాయజ్ఞముమ్, అధ్యయనమ్ పణ్ణుకై, పణ్ణువిక్కై, యజిక్కై, యజిప్పిక్కై, దానమ్పణ్ణుకై, కొళ్ళుకై-యెన్నాఱ్పోలే శొల్లుకిఱ ఇవఱ్ఱై త్తొழிలాకవుడైయరాన బ్రాహ్మణర్క్కు ఆశ్రయణీయనాయిరుక్కుమ్బడి శొల్లిఱ్ఱు.**

**పెరియ-అను. :-** అంతరంగ అయిన పిరాట్టి రక్షించిన విషయాన్ని -**"వాళియిల్ అట్టనై"** అని అంటూ తెలిపారు. ప్రయోజనాంతపరుడైన ఇంద్రునకు సహాయపడిన విషయాన్ని **"మూవుల కళన్దనై"** అని అన్నారు. అనన్యప్రయోజనుడై, అనన్యోపాయుడైన గజేంద్రునకు సహాయపడిన విషయాన్ని **"మడువుళ్ తీర్త్తనై"** అని అన్నారు. ఇక స్వప్రయత్నంలో సంబంధం తీరనందువల్ల, ఉపాయాలు కాని ఉపాయాంతరాలలో ఉపాయబుద్ధిని కల్గి, అతనితోపాటు వానిని కూడా ఉపాయాలుగా ఆశ్రయించేవారికికూడా వారి దారిలోనే పయనించి, ప్రతి దశలోను ఆ ఉపాయాలను సఫలం చేసి, వారు కోరే ఫలాలను అనుగ్రహించే మహిమను తెలుపుతున్నారు.

**(ముత్తీ)-"యోగో యోగవిదాం నేతా"** అన్నట్లు తానే ఉపాయమై, అన్యోపాయాలను ఆశ్రయించినవారికి వానిని సఫలం చేసేవాడై ఉన్నాడు అని విష్ణుసహస్రనామంలో కూడా తానే నిరుపాధికోపాయస్వరూపుడుగా ఉన్న తీరు, సోపాధికోపాయాలను ఆశ్రయించినవారికి వానిని సఫలం చేసేవాడుగాను ఉన్న తీరు తెలుపబడింది కదా! ఆ ఉపాయరీతిలో మొదటిది అయిన కర్మయోగాన్ని అనుష్ఠించేవారై, దానికి తగినట్లు నాల్గు వర్ణాలలో మిక్కిలి ఉన్నతమైన బ్రాహ్మణవర్ణంలో జన్మించి, సన్మార్గంలో ప్రవర్తించే బ్రాహ్మణులందఱిచేత ఆ కర్మయోగంతో ఆశ్రయించతగినవాడై ఉండడాన్ని మొదట అనుగ్రహిస్తున్నారు. **(ముత్తీ)**-గొప్ప ఆకలినికల ముగ్గురు బిడ్డలను ఒకే ప్రసవంలో



కన్నతల్లి ఆ ముగ్గురిని పెంచలేక అల్లాడినట్లు, గార్హపత్యం, ఆహవనీయం, దక్షిణాగ్ని-అనే మూడగ్నులకుకూడా (ఎంతగా ఇంధనాన్ని వేసినా చాలునని అనని అగ్నులకు కూడా) ఒకే సమయంలో పరిచర్య చేసినట్లు. **(నాన్ మఱై)**- ఆ కర్మయోగాన్ని చక్కగా అనుష్ఠించడానికి వీలుగా ఋగ్యజుస్సామాథర్వణాలనే నాల్గు వేదాలను అభ్యసించినవారు. **(ఐవకై వేళ్వి)- దేవయజ్ఞ-పితృయజ్ఞ-భూతయజ్ఞ-మనుష్య యజ్ఞ- బ్రహ్మయజ్ఞః"** (తైత్తి-ఆర-2-10) అధ్యయనం చేయబడే అయిదు విధాలైన యజ్ఞాలను ప్రతిదినం నిర్వహిస్తున్నారని భావం. **(అఱు తొழிల్)** యజన (తాను యాగాన్ని చేయడం), యాజనం (ఇతరులను యాగాన్ని చేయించడం), అధ్యయనం (తాను వేదాన్ని నేర్వడం) అధ్యాపనం (ఇతరులకు వేదాన్ని నేర్పించడం), దానమ్ (ఇతరులకు అవసరమైనదానిని ఇవ్వడం, ప్రతిగ్రహం (ఇతరుల నుండి అవసరమైన దానిని పొందడం) అనే షట్కర్మలను కల్గినవారని భావం. మిగిలిన వర్ణాలవారికి వీటిలో కొన్నిటిలోనే అధికారం ఉన్నది. దీనివల్ల అనుష్ఠించడానికి కష్టసాధ్యం అయిన కర్మయోగం తెలుపబడింది. బ్రాహ్మణులకు తగిన అన్ని గొప్పతనాలను పూర్ణంగా పొందినవారుగా వీరిని చెప్పడం చేత జ్ఞానసహితకర్మయోగాన్ని అనుష్ఠించేవారు వీరు-అని తెలుస్తున్నది. **(అన్దణర్ వణఙ్గుమ్ తన్మైయై)**- ఈ కర్మయోగంతో నిన్నే పొందగోరి, నిన్ను ఆశ్రయించే బ్రాహ్మణులచేత ఆరాధింపబడే స్వభావాన్ని కల్గినవాడవై ఉన్నావు.

**ఐమ్బులన్**
**అకత్తినుళ్ శెఱుత్తు-నాన్గుడనక్కి**
**ముక్కుణ త్తిరణ్డవై యకఱ్ఱి-ఒన్ఱినిల్**
**ఒన్ఱి నిన్ఱు-ఆఙ్గిరుపిఱప్పఱుప్పోర్**
**అఱియు న్దన్మైయై**

**ప్రతి:-** ఐమ్బులన్ =పంచేంద్రియాలను, (బయట అప్రాప్తవిషయాలలో లగ్నంకాకుండా) అకత్తినుళ్ శెఱుత్తు =లోపల నియంత్రించి, నాన్గు ఉడన్ అడక్కి=భుజించడం, నిద్రించడం, భయపడడం, విషయభోగాలను పొందడం-అనే నాల్గింటినికూడా లేకుండా చేసి, ముక్కుణత్తు =సత్త్వ-రజ-స్తమస్సులనే మూడుగుణాలలో, ఇరణ్డు అవై=రజస్సును, తమస్సును, అకఱ్ఱి =తొలగించి, ఒన్ఱినిల్=ఒక సత్త్వగుణంలోనే, ఒన్ఱి నిన్ఱు=స్థిరంగా నిలచి ఉండి, ఆఙ్గు =అటువంటి స్థితికి ఫలంగా, ఇరు పిఱప్పు అఱుప్పోర్=దీర్ఘమైన సంసారదుఃఖాన్ని పోగొట్టుకొనగల్గే మహాత్ములచేత, అఱియుమ్ తన్మైయై=తెలిసికొనగల స్వభావాన్ని కల్గినవాడవై ఉన్నావు.

**పెరియ-ప్రథమ :- (ఐమ్బులనిత్యాది) కర్మయోగత్తై అఙ్గమాక వుడైత్తాన ఉపాయమ్ శొల్లప్పడుకిఱదు. (ఐమ్మలనకత్తినుళ్ శెఱుత్తు) చక్షురాదీన్ద్రియఙ్గళై శబ్దాదివిషయఙ్గళిలే పోకామే ఉళ్ళే యడక్కి. (నాన్గుడ నడక్కి) మనోబుద్ధిచిత్తాహఙ్కారఙ్గళైయుమ్ శెఱుత్తు.**

**ఆహారనిద్రాభయమైథునజ్గళైయుమ్ తవిర్త్తు ఎన్నుమామ్. (ముక్కుణత్తిరణ్డవై యకఱ్ఱి) గుణత్రయజ్గళిల్ రజస్తమస్సుక్కళై త్యజిత్తు. (ఒన్ఱినిలొన్ఱి నిన్ఱు) సత్త్వమొన్ఱిలుమే పొరున్ది నిన్ఱు. (ఆఙ్గు) అన్ద యోగత్తిలే. (ఇరుపిఱప్పఱు పోరఱియుమ్తన్మైయై) పుణ్యపాపరూపమాన కర్మజ్గళాలే వరుమ్ సంసారత్తై యఱుక్కు ముపాసకరాలే అఱియప్పడుమ్ స్వభావత్తై యుడైయైయాయ్. ఇప్పడి యిరున్ద యోగత్తాలే యనుభవిక్కైయావదు-శ్రీగజేన్ద్రాళ్వానుడైయ మిడక్కుళ్ళ దశైయోడొక్కుమత్తనై. ఆనపిన్బు అవనైయే ఉపాయమాక ప్పఱ్ఱి ప్పిఴైక్క వేణుమ్.**

**పెరియ-ద్వితీయ :- ఇని, సంసారభయభీతరాయ్, ముముక్షుక్కళాయిరుప్పార్క్కు ఆశ్రయణీయనాయిరుక్కుమ్బడి శొల్లుకిఱదు.**

**(ఐమ్బుల నిత్యాది) శ్రోతాదివిషయజ్గళిల్ పోకాతపడియాక నియమిత్తు, "నిత్యానిత్యవివేకమ్, శమదమాదిసాధనసమ్పత్తు, ఇహాముత్రచ ఫలభోగవిరాగమ్, ముముక్షుత్వమ్" ఎన్నాప్పోలే శొల్లుకిఱ సాధనచతుష్టయత్తైయుముడైయరాయ్. అన్ఱిక్కే, ఆహారాదికళై త్తవిర్త్తు, సత్త్వరజ స్తమస్సుక్కళిల్ వైత్తుక్కొణ్డు రజస్తమస్సుక్కళై క్కళైత్తు నిష్కృష్ట సత్త్వత్తైయుడైయరాయ్క్కొణ్డు నిన్ఱు అన్ద యోగత్తాలే పుణ్యపాపరూప కర్మజ్గళడియాన సాంసారికదుఃఖత్తై యఱుత్తు క్కొళ్ళవేణు మెన్ఱు ఇరుప్పార్ అఱియుమ్ స్వభావత్తై యుడైయనాయిరుక్కుమ్. సాధనాన్తరపరిగ్రహమ్ పణ్ణినార్ ఉన్నై ప్పెఱ్ఱెప్పోకానిఱ్క, ఉన్నైయే సాధనమాక ప్పరిగ్రహిత్త నాన్, ఉన్నై ప్పెఱాతేపోవదే!**

**పెరియ-అను :-** ఇక, అంగమైన ఈ కర్మయోగంతో పొందబడేది, దీనికంటే చేయడానికి మిక్కిలి అరుదైనది, సంసారాన్ని చూచి భయపడి మోక్షాన్ని కోరే ఉపాసకులు అనుష్ఠించేది అయిన భక్తియోగంతో తెలిసికోబడేవాడైయుండడాన్నిగూర్చి తెలుపుతున్నారు. **(ఐమ్బులన్ అకత్తినుళ్ శెఱుత్తు)** త్వక్కు, వాక్కు, ముక్కు, చెవి, కన్ను-అనే అయిదు బాహ్యేంద్రియాలను శబ్దస్పర్శ రూపరసగంధాలనే బాహ్యవిషయాలలో ప్రవర్తించకుండా ఉండేటట్లు చేసి, నిన్నే అణచి. **(నాన్గు ఉడన్ అడక్కి)** అంతరింద్రియం అయిన మనస్సుయొక్క నాల్గు దశలు ఒకే సమయంలో అణచి అని భావం. మనసు మననం చేసేటపుడు "మనస్సు" అని, తెలిసికొనేటపుడు "బుద్ధి" అని, చింతించేటపుడు "చిత్తం" అని, అహంకరించేటపుడు (నేను అని భావించేటపుడు) "అహంకారమ్" అని చెప్పబడుతున్నది. ఈ నాల్గు దశలను ఒకేసారి అణచి దీనివల్ల బాహ్య-అంతరింద్రియాలను అన్నిటిని అణచడం అనే చేయడానికి వీలులేని కార్యాన్ని చేయాలి-వీరు అనే విషయం తెలుపబడుతున్నది. **(నాన్గుడ నడక్కి)** అని అంటూ సకలప్రాణులకు సమానమైన, సహజమైన ఆహారం, నిద్ర, భయం మైథునం - అనే నాల్గింటిని వీరు నియంత్రించాలి-అని చెప్పినట్లుకూడ చెప్పవచ్చు. లేక, **"నిత్యానిత్యవస్తువివేకమ్, శమమ్, దమమ్"** మొదలైన సాధనసంపత్తి, ప్రాకృతాలు



అయిన ఇహపరాలలో ఆశలే కూడా ఉండడం. మోక్షాన్ని పొందడంలో కోరికను కలవాడై ఉండడం" - అనే నాల్గు మోక్షసాధనాలను తాము కలవారై ఉండడాన్ని చెప్పినట్లు భావింపవచ్చును. **(ముక్కుణత్తు ఇరణ్డవై అకఱ్ఱి)**- సత్వం, రజస్సు, తమస్సు - అనే మూడు ప్రాకృతగుణాలలో క్రిందకు లాగికొని పోయే రజస్తమస్సులను మిక్కిలి ప్రయత్నపూర్వకంగా అడ్డుపెట్టి. **(ఒన్ఱినిల్ ఒన్ఱి నిన్ఱు)**-వృద్ధి చెందిన ఒక్క సత్త్వగుణంలోనే నిలకడగా ఉండి. **(ఆఙ్గు)** ఆ కర్మయోగసాధ్యం అయిన భక్తియోగంతో. **(ఇరు పిఱప్పు అఱుప్పోర్)** పుణ్యం, పాపం అనే ద్వివిధకర్మలతో ఏర్పడే పుణ్యజన్మ, పాపజన్మలనే-రెండు విధాలైన జన్మలను ఛేదించుకొనే ఉపాసకులచే. **(అఱియుమ్ తన్మైయై)**- తెలిసికొనబడే గుణాలను కల-అని భావం. ఇక్కడ జన్మనుగూర్చి తెల్పినది సంసారానికి ఉపలక్షణం. **(ఆఙ్గు పిఱప్పు అఱుప్పోర్)** అని అన్వయించి భక్తియోగంతో జన్మను ఛేదించుకొనేవారు-అనే అర్థాన్ని చెప్పవచ్చు. ఆ విధంగా కాకుండా **(ఆఙ్గు అఱియుమ్)**- అని అన్వయించి, భక్తియోగంలో ఉపాసకులు తెలిసికొనే-అనే అర్థాన్నికూడా గ్రహించవచ్చు.

**"ముత్తీ"** అని ప్రారంభించి ఇంతవరకు తెల్పిన తాత్పర్యం ఏమి? అని అంటే, ఈ విధంగా కష్టసాధ్యం అయిన జ్ఞానసహితకర్మయోగభక్తియోగాలతో సంసారాన్ని పోగొట్టి, భగవానుని అనుభవించాలని భావించడం అంటే గజేంద్రుడు తన బలంతో మొసలిని జయించి, భగవానుని శ్రీపాదాలలో పుష్పాలను సమర్పించాలని ఆశపడిన స్థితితో పోలినది. ఇది ఇంచుమించుగా నశించిపోవడమే. అందువల్ల అతనినే ఉపాయంగా ఆశ్రయించి తరించాలి-అని, "దుస్సాధాలై, స్వరూపవిరుద్ధాలై, వాస్తవానికి మోక్షోపాయాలు కానట్టి సాధనాంతరాలను ఆశ్రయించినవారిలోకూడా కొందఱు చాలా శ్రమపడి నిన్ను పొందుతుండగా, సిద్ధమై, స్వరూపానురూపమై, నిజానికి మోక్షోపాయం అయిన నిన్ను ఉపాయంగా ఆశ్రయించిన నేను నిన్ను పొందకుండా ఉండడమా? అనే అర్థం లోపల స్ఫురించేటట్లు **"ముత్తీ"** అని ప్రారంభించి, **"అఱియుమ్ తన్మైయై"** అన్నంతవరకు అనుగ్రహించారు.

**ముక్కణ్ నాఱ్ఱోళ్**
**ఐవాయరవోడు - ఆఱుపొది శడైయోన్**
**అఱివరున్దన్మై ప్పెరుమైయుళ్ నిన్ఱనై**

ప్రతి:-ముక్కణ్=మూడు నేత్రాలను, నాల్ తోళ్=నాల్గు భుజాలను, ఐ వాయ్ అరవొడు= అయిదు నోళ్ళనుకల సర్పాన్ని, ఆఱు పొది శడైయోన్=గంగానదినికల జటను కల్గినవాడైన రుద్రునకు, కూడా, అఱివు అరు=తెలిసికోవడానికి అరుదైన, తన్మై=స్వభావాన్ని కలవాడవై ఉండే, పెరుమైయుళ్=గొప్పతనాన్ని, నిన్ఱనై=స్థిరంగా కల్గి ఉన్నావు.

**పెరియ-ప్రథమ :- (ముక్కణిత్యాది) తన్దాముడైయ కణ్గళిన్ మికుతియాలుమ్ జ్ఞానాధిక్యమెన్గిఱ విదువే ఏఴ్వామాక క్కణిశిప్పార్క్కుమ్ అవర్కళుక్కు మెట్టాత స్వభావత్తైయుడైయవనెన్గిఱదు. (ముక్కణ్ నాల్ తోళ్) మూన్డు కణ్గళైయుమ్, నాన్గు తోళైయుముడైయనాకైయాలే బహుపరి కరనాయ్. (ఐవాయరవోడు ఆఱు పొతి శడైయోన్) ఐన్దు వాయైయుడైయ, పామ్బైయుమ్, గఙ్గైయుమ్ ఏకదేశత్తిలే యడక్కిన జటైయై యుడైయనాకైయాలే అధికశక్తనాయిరున్దుళ్ళ రుద్రనుమ్. (అతివరుమ్ తన్నై ప్పెరుమైయుళ్ నిన్ఱనై) ఇప్పిడార్ కొణ్డతియవొణ్ణాద స్వభావమాకిఱ పెరుమైయైయుడైయోయాయ్ నిన్ఱాయ్. ఆకైయాలే "పెరియ కిఴాయాన రుద్రాదికళ్ నిలైయిదువానాల్, క్షుద్రరాన వెజ్గళుక్కు ప్పెఱ విరకుణ్డో? నీయే విషయీకరిక్కు మిత్తనై" ఎన్ఱు కరుత్తు.**

**పెరియ-ద్వితీయ :- అభిమానికళాయిరుప్పార్ ఎత్తనైయేను మతిశయితజ్ఞానరాయ్ ఇరున్దార్కళేయాకిలుమ్ అవర్కళుక్కు మఱియవొణ్ణాద పడియాన ఉత్కర్షమ్ శొల్లుకిఱదు. (ముక్కణిత్యాది) లలాటనేత్రనాయ్, "సర్వేశ్వరన్ నాలు తోళుమ్ తానుమా యిరున్దాన్" ఎన్ఱు తానుమ్ నాలుతోళై యుముడైయనాయ్, ఐన్దు వాయైయుడైయ అరవైయుడైయనాయ్, గఙ్గైయై యడక్కిన జటైయైయుడైయనాన రుద్రన్, తన్నుయర్త్తియెల్లామ్ కొణ్ణు అతియప్పార్త్తాలుమ్ అతియవొణ్ణాద స్వభావమాకిఱ పెరుమైయైయుడైయైయాయ్ నిన్ఱాయ్. కిఴాయార్ పడుకిఱదు ఇదువానాల్ నా నున్నై యఱికై యెన్ఱారు పొరుళుణ్డో?**

**అరు:- కిఴాయ్ - కిఴాయాన్-మిశ్రరెన్ను మాపోలే శ్రేష్ఠవాచకమ్. వ్యంగ్యోక్తి.**

**పెరియ-అను :-** ఇక, ఉపాసకులచేత తమతమ ఉపాసనాలద్వారా తెలియబడే గుణాలను కల్గిన -అని అంటూ పల్కినది, వారు తెలిసిన రీతిలో అనుసంధించిన ప్రకారాన్ని తెల్పినదే తప్ప, పరిచ్ఛేదించి పల్కడం మాత్రం కాదు-అని తెలుపడం కోసం విలక్షణమైన జ్ఞానాన్ని కల రుద్రునిచేత సైతం పరిచ్ఛేదించి తెలిసికోవడానికి సాధ్యంకాని స్వభావాన్ని కలవాడనే విషయాన్ని చూపుతున్నారు. **(ముక్కణ్....)** స్వాపదేశంలో జ్ఞానాన్ని సూచించే కన్నుల ఆధిక్యంచేత, **"ఈశ్వరాత్ జ్ఞాన మన్విచ్ఛేత్"** (శివునివల్ల జ్ఞానాన్ని పొందగోరాలి) అని అన్నట్లు ఇతరులకు జ్ఞానప్రదాతగా ప్రసిద్ధి చెందినవాడు కావడంచేత, తనను గొప్ప జ్ఞానిగా అభిమానించే రుద్రుడు తన గొప్ప జ్ఞానంతో అతనిని (భగవానుని) తెలిసికోవాలని చూస్తే కూడా ఆ రుద్రునకుకూడ అందని స్వభావాన్ని కలవాడు-అని తెలుపపబడింది. **(ముక్కణ్)**-మూడు నేత్రాలను కలవాడు. నేత్రసంఖ్యలోని ఆధిక్యం జ్ఞానాధిక్యాన్ని సూచిస్తుంది. **(నాల్ తోళ్)** సర్వేశ్వరుడు చతుర్భుజుడై ఉండడాన్ని చూచి, తాను కూడ నాల్గు భుజాలను కల్గి ఉండేవాడు. శక్తిలో గొప్పవాడనే అర్థాన్ని ఇది సూచిస్తుంది. **"ఒన్ఱిరణ్డు కణ్ణినాలుమ్ ఉన్నై ఏత్తవల్లవనే"** (తిరుచ్చన్ద-7) అన్నట్లు ఈ విధంగా తెలియడానికి



అవసరం అయిన జ్ఞానశక్తులను నిండుగా కలవానిచేతకూడ తెలిసికోవడానికి సాధ్యం కాదు-అని తెలుపబడడంద్వారా మిగిలినవారు తెలిసికొనే ప్రసక్తి ఏ మాత్రంలేదు- అని తెలుపుతున్నారు. **(ఐవాయ్ అరవోడు ఆఱు పొది శడైయోన్)** అయిదు నోళ్ళనుకల సర్పాన్ని, గంగను ఒక వైపు పొందికగాకల జటను కలవాడు. ఇదికూడా ఇతని శక్తి విశేషానికి సూచకం. **"అరవోడు ఆఱు పొది"** అని అన్నందువల్ల రెండు జటల్లో ఉన్నట్లు తెలుపబడింది. లేక, **"అరవోడు"** అన్నది సర్పం శరీరంలో ఉన్న విషయాన్ని తెల్పు తున్నదని కూడా చెప్పవచ్చు. **(అతివరుమ్తన్నై ప్పెరుమైయుళ్ నిన్ఱనై)** ఈ జ్ఞానశక్తులను కల గొప్పతనాన్ని కలవాడవై ఉన్నావు. ఇందుచేత, "గొప్ప జ్ఞానశక్తులను కల గొప్పవాడైన రుద్రుడు మొదలైనవారి స్థితిసైతం ఇటువంటిది అయినపుడు, అల్పజ్ఞానశక్తులనుకల నా వంటివారు వాటిద్వారా నిన్ను పొందడానికి సాధ్యమా! నీవే నీ నిర్హేతుకకృపతో నాకు అనుగ్రహించాలి" అనే అర్థాన్ని సూచిస్తున్నారు.

**ఏఴులకెయిఱ్ఱినిఱ్కొణ్డనై-కూఱియ**
**అఱు శువై ప్పయను మాయినై- శుడర్ విడుమ్**
**ఐమ్బడై అజ్గైయుళమర్న్దనై-శున్దర**
**నాఱ్ఱోళ్ మున్నీర్ వణ్ణ-నిన్నీరడి**
**యొన్ఱియ మనత్తాల్-ఒరు మది ముకత్తు**
**మఙ్గైయరిరువరుమ్ మలరన- అజ్గైయిన్**
**ముప్పొఴుదుమ్ వరుడ అఱితుయిలమర్న్దనై**

**ప్రతి:-** ఏఴ్ ఉలకు=లోకాలను అన్నిటినీ, ఎయిఱ్ఱినిల్ కొణ్డనై=(శ్రీవరాహరూపాన్ని ధరించి) దంతాగ్రంలో ఎత్తావు, కూఱియ అఱు శువై పయనుమ్ ఆయినై=ప్రసిద్ధంగా చెప్పబడే షడ్రసాలనబడే ప్రయోజనంకూడా నీవే అయి ఉన్నావు, అమ్ కైయుళ్=అందమైన శ్రీహస్తంలో, శుడర్ విడుమ్ ఐ పడై=వెలుగును చిమ్మే పంచాయుధాలను, అమర్న్దనై =పొందికగా కల్గి ఉన్నావు, శున్దరమ్ నాల్ తోళ్=సముద్రంవంటిరూపాన్ని కల స్వామి!, నిన్ ఈర్ అడి=నీ రెండు శ్రీపాదాలను, ఒన్ఱియ మనత్తాల్=గాఢమైన భక్తితో, ఒరు మది ముకత్తు మఙ్గైయర్ ఇరువరుమ్=విలక్షణుడైన చంద్రునివంటి తిరుముఖాన్నికల లక్ష్మీదేవి, భూదేవులనే ఇద్దఱు దేవేరులు, మలర్ అన అమ్ కైయిన్=పుష్పవంటి సుకుమారం అయిన (తమ) అందమైన శ్రీహస్తాలతో, ముప్పొఴుదుమ్=ఎల్లప్పుడు, వరుడ = సంవాహనం చేయగా, అఱి తుయిల్ అమర్న్దనై=(ఆనందంగా) యోగనిద్రలో వేంచేసి ఉన్నావు.

**పెరియ-ప్రథమ :- (ఏఴులకెయిఱ్ఱినిల్ కొణ్డనై) అపత్తు వన్దాల్ శక్తరోడు అశక్తరోడు వాశియిన్ఱిక్కే సర్వప్రాణికళుక్కుమ్ ఉదవి యరుళినాయ్. మహావరాహమాయ్, ప్రళయ**

జ్గొణ్డ ఏఴు లోకత్తైయుమ్ తిరువయిఱ్ఱిలే వైత్తరుళినాయ్. ఇత్తాల్ "ప్రళయజ్గొణ్డ భూమియై యెడుత్తా ఱ్పోలే భవార్ణవజ్గొణ్డ వెన్నైయుమ్ ఎడుత్తరుళవేణుమ్" ఎన్గిఱార్.

(కూఱియ వఱు శువై ప్పయనుమాయినై) మనుష్యర్క్కు, భోగ్యమాన షడ్రసరూపమాన ప్రయోజనమానాయ్. "ఎన్నుడైయ ప్రయోజనత్తైయుమ్ ఎనక్కు త్తన్దరుళవేణు" మెన్గిఱార్. (శుడర్విడుమైమ్బడై యజ్గైయుళమర్న్దనై) తమ్ముడైయ భోగ్యమిరుక్కుమ్బడియై యరుళిచ్చెయ్కిఱార్. (శుడర్ విశుమ్బడై అజ్కైయుళ్ అమర్న్దనై మికవుమ్ విళజ్గా నిన్గుళ్ళ పఞ్చాయుధజ్గళైయుమ్, వెఱుమ్బుఱత్తిలే ఆలత్తివఴిక్క వేణ్డుమ్బడి యిరున్దుళ్ళ తిరుక్కైకళినుళ్ళే ఆభరణమ్బోలే యమరుమ్బడి ధరిత్తాయ్. (శున్దర నాఱ్ఱోళ్). అఴకై వకుత్తాప్పోలే నాలు తోళైయు ముడైయైయాయ్. (మున్నీర్వణ్ణ) శ్రమహరమాన వడివై యుడైయవనే!

(నిన్నీరడి యిత్యాది) తమ్ముడైయ అపేక్షితమ్ పెఱుకైక్కు ప్పురుషకార ముణ్డెన్గిఱార్. (నిన్నీరడియొన్ఱియ మనత్తాల్) అనన్యభోగ్యరసరాయ్. (ఒరు మది ముకత్తు) కల్మషమ్ కఴిఱ్ఱిన పూర్ణచన్ద్రనైప్పోలే. (మజ్గైయరిరువరుమ్) తన్దామ్ భోగత్తై క్కోట్పొల్లానిన్ఱ ముఖత్తైయుడైయరాయ్. (మజ్గైయర్) "తుల్యశీలవయోవృత్తామ్" ఎన్నుమ్, "యువతి శ్చ కుమారిణీ" ఎన్నుమ్. తజ్గళ్ పరువత్తాలే పిచ్చేఱ్ఱవల్ల పిరాట్టిమారిరువరుమ్. (మలరెన వజ్గైయిల్) పుష్పత్తై దృష్టాన్తిక్కవొణ్ణాత మెన్మైయై యుడైయవాన తిరుక్కైకళాలే. (ముప్పొఴుతుమ్ వరుడ) సర్వకాలముమ్ వరుడ. (అఱితుయిల్) ఆశ్రితసంరక్షణప్రకారత్తై యనుసన్ధిక్కై. (అమర్న్దనై) వీశి విల్లిట్టు ఎఴుప్పినాలుమ్ ఎఴుప్పప్పోకాతు.

పెరియ-ద్వితీయ :- (ఏఴులకెయిఱ్ఱినిల్ కొణ్డనై) ఆపత్తు వన్ద వన్ఱు అన్ద రుద్రాదికళో? నీయో? ఉదవినార్. ప్రళయమ్కొణ్డు అణ్డభిత్తియిలే పుక్కు చ్చేర్న్ద లోకజ్గళై మహావరాహ మాయ్ ప్పుక్కిడన్దెడుత్తు త్తిరువెయిఱ్ఱిలేకదేశత్తిలే ఒరు నీలమణి యఴుత్తినాఱ్పోలే కిడక్కుమ్బడి వైత్తాయ్. సంసారప్రళయమ్ కొణ్డ వెన్నైయో? వెడుక్కలాకాదు. (కూఱియ విత్యాది) శాస్త్రజ్గళాల్ శొల్లప్పడుకిఱ షడ్రసజ్గళినుడైయ ప్రయోజనరూపమా యిరున్దువైత్తు ఎన్నుడైయ ప్రయోజనత్తై యెనక్కు త్తరవేణుమ్.

(శుడ రిత్యాది) మికవుమ్ ప్రకాశత్తైయుడైత్తాయిరుక్కిఱ దివ్యాయుధజ్గళై, వెఱుమ్ పుఱత్తిలే ఆలత్తివఴిక్క వేణ్డుమ్బడియాన అఴకియ తిరుక్కైయిలే ధరిప్పాయాయ్, తనక్కుత్తానే అఴకై విళైప్పతాన నాలు తిరుత్తోళ్కళై యుడైయైయాయ్, కడల్పోలే శ్రమహరమాన వడివై యుడైయవనే! (నిన్నిత్యాది) దేవరీర్ తిరువడికళిలే ఒరుమైప్పట్ట నెఞ్జై యుడైయరాయ్, చన్ద్రనైప్పోలే దర్శనీయమాయ్, క్కుళిర్ న్ద ముఖత్తైయుడైయరా యిరుక్కిఱ పెరియపిరాట్టియారుమ్ శ్రీభూమిప్పిరాట్టియారుమ్ పూత్తాఱ్పోలే యిరుక్కిఱ



మృదువాన తిరుక్కైకళాలే తిరువడికళై వరుడ, జగద్రక్షణానురూపమాన యోగనిద్రైయిలే యొరుప్పట్టిరున్దాయ్. ఎనక్కు ప్పురుషకారమిల్లామే యిఴక్కితేనో?.

**పెరియ-అను :- (ఏఴులకు ఎయిఱ్ఱినిల్ కొణ్డనై)** ఈ లోకానికి ప్రళయకాలంలో ఆపద వచ్చినపుడు ఆ రుద్రాదులు సహాయపడలేదే! నీవే కదా రక్షించావు. **(ఏఴులకు)** శక్తినికల ఆ రుద్రాదులతో పాటు, మాతోపాటు ఏభేదం లేకుండ అందఱిని ప్రళయం గ్రహించినపుడు. అండభిత్తికి అంటుకొని ఉన్న అన్ని లోకాలను, బురదకు, నీటికి వెనుకంజవేయని మహావరాహరూపాన్ని ఎత్తి లోపల ప్రవేశించి, నీ దంతాగ్రంతో గుచ్చి ఎత్తి, నీ శ్వేతదంతాగ్రంలో మల్లెపూవులో చేరిన తుమ్మెదవలె, తెల్లనిఆభరణంలో పొదిగిన నీలమణివలె వెలిగేటట్లు భూమిని ధరించావు-అని భావం. ఇందువల్ల, "ప్రళయం పొందిన భూమిని ఎత్తి ఉద్ధరించినట్లే, సంసారప్రళయాన్ని పొందిన నన్నుకూడ ఎత్తి ఉద్ధరించాలి" అనే భావాన్ని ఇక్కడ వ్యక్తం చేశారు. **"ఏఴులకు"** అన్నది కింద, పైన ఉన్న ఏడేడు లోకాలను తెలుపడంద్వారా సకలలోకాలను ఉపలక్షిస్తున్నది.

**(కూఱియ అఱు శువై ప్పయనుమ్ ఆయిన)** -ఈ లోకంలో మానవులకు ప్రాప్యంగా శాస్త్రాలలో చెప్పబడే ఉప్పు, పులుపు, కారం, చేదు, వగరు, తీపి-అనే ఆఱు రుచులుగా అయ్యావు. **"ఆఱుశువై అడిశిల్ ఎన్ గో"** (తిరువాయ్-3-4-5) అని నమ్మాఴ్వార్లు కూడా అన్నారు." వారికి తీయని మధురభోజ్యపదార్థమై, వారు కోరే ఫలాన్ని ప్రసాదించేటట్లు, నాకు తీయని ప్రాప్యంగా ఉండే షడ్రసాన్నం అయిన నిన్ను నాకు నీవు అనుగ్రహించాలి - అనే అర్థాన్ని దీనివల్ల వ్యక్తం చేశారు.

తమ షడ్రసాన్నం అయిదు దివ్యాయుధాలు, వానిని ధరించిన అందమైన బాహువులే-అనే విషయాన్ని ఇక తెలుపుతున్నారు. **(శుడర్ విడుమ్ ఐమ్బడై అజ్కైయుళ్ అమర్న్దనై)** మిక్కిలిగా ప్రకాశించే శంఖం, చక్రం, గద, శార్ఙ్గం, నందకం-అనే అయిదు ఆయుధాలను, అవి లేకపోయినా దృష్టిపరిహారాన్ని చేయవలసినట్లు అందంగా ఉన్న బాహువులలో ఆభరణాలవలె ధరించి ఉన్నావు.

**(శున్దర నాల్ తోళ్ మున్నీర్ వణ్ణన్)** అందమనే తత్వాన్ని నాల్గు భాగాలు చేసినట్లుగా ప్రకాశించేవి, **"సర్వభూషణభూషార్హా బాహవః"** (రామా.కి-3-15) (అన్ని ఆభరణాలను అలంకరించదగిన బాహువులు) అన్నట్లు అందానికి వేఱొక ఆభరణాన్ని అపేక్షించకుండా తమకు తామే అందాన్ని కల్గించుకొనేవి, నిజానికి ఆభరణాలకుకూడా అందాన్ని ఇచ్చేవి అయిన దివ్యబాహువులను కలవాడవై. (ప్రవాహజలం, ఊటనీరు, వర్షపునీరు-అనే మూడు చేరినందువల్ల **"మున్నీర్"** అని వ్యవహరింపబడే సముద్రంవలె చూచేవారి శ్రమను తీర్చే రూపసౌందర్యాన్ని కలవాడా! ఈ రూపసౌందర్యాన్ని నాకు పూర్ణభోజనంగా అనుభవింపజేయాలి-అని భావం.

**(నిన్నీరడి...)** ఈ ఫలాన్ని పొందడానికి తగిన పురుషకారబలం ఉన్నదనే విషయాన్ని ఇక తెలుపుతున్నారు. **(నిన్ ఈరడి ఒన్టియ మనత్తాల్)** రెండు శ్రీపాదాలలోనే లగ్నమై ఉన్న మనస్సును కలవారై – అని భావం. దీనివల్ల అనన్యప్రయోజనత్వం చెప్పబడింది. **(ఒరు మది ముకత్తు)** లోకంలో కన్పించే కళంకాన్ని కల్గిన చంద్రునివలె కాకుండా కళంకం లేనందువల్ల సాటిలేని ఒక పూర్ణచంద్రునివలె అందమైనద్తై, భగవానుని కన్నులార పానం చేయడాన్ని దర్శింపజేసేద్తై, చల్లని ముఖాన్ని కల్గినవారై ఉండే, **(మజ్గైయర్ ఇరువరుమ్)– "తుల్యశీలవయోవృత్తామ్"** (రామా.సు.–16–5) (సదృశగుణం, వయస్సు, వర్తనం మొదలైనవానిని కల్గినది) అని, **"యువతి శ్చ కుమారిణీ"** (కుమారివయస్సు చివరి దశలోను, యువతిదశ ప్రారంభంలోను ఉన్నది) అని పల్కేటట్లే తమ పరువంతో, **"పార్ వణ్ణ మడమజ్గై పత్తర్ పిత్తర్ పనిమలర్మేల్ పావైక్కు"** (తిరునెడు–18) (భూదేవికి విధేయుడు, చల్లని తామరపువ్వుపై నివసించే లక్ష్మీపట్ల వ్యామోహాన్ని కలవాడు) అన్నట్లు అతనినికూడ పిచ్చివానిగా చేసే లక్ష్మీదేవి, భూదేవులనే పత్నులు ఇద్దఱు. **(మలర్ అన అజ్కైయిన్)** పూవుతో తాకినట్లు సౌకుమార్యం అతిశయించి ఉండే తమ అందమైన శ్రీహస్తాలతో– అని భావం. **"మలర్ ఎన అజ్కైయిన్"** అనే పాఠాంతరంకూడా ఇక్కడ కన్పిస్తున్నది. పూవులతో పోలినవి ఈ చేతులు అని అంటూ పూవును ఉపమానంగా చెప్పాలని అనుకుంటే, వానికంటే అందం, సౌకుమార్యం, వర్ణం, సౌగంధ్యం–మొదలైన గొప్పతనాలను కల్గి ఉండడంచేత వాటిని ఉపమానం చేయడానికి వీలులేనట్లు వైలక్షణ్యాన్నికల శ్రీహస్తాలతో–అని భావం – **"చంద్రకాంతాననం రామ మతీవ ప్రియదర్శనమ్"** (రామా.ఆర–3–29) (చంద్రునివలె ఆకర్షణీయమైన ముఖం కలవాడు, అంతకంటె ఎక్కువ మధురమైన రూపాన్ని కలవాడు అయిన రాముని) అని అన్నట్లు. **(ముప్పొళుదుమ్ వరుడ)** – భూతభవిష్యద్వర్తమానాలనే త్రికాలాలలోను **"వడివిణైయిల్లా మలర్ మకళ్ మఱ్ఱ నిలైమకళ్ పిడిక్కుమ్ మెల్లడి"** (తిరువాయ్–9–2–10) అనే రీతిలో సంకోచిస్తూ సంవాహనం చేసేటట్లు. **(అఱి తుయిల్ అమర్న్దనై)** లోకాలను అన్నిటిని, ముఖ్యంగా భక్తులను అందఱిని రక్షించడం ఏ విధంగా? అని చింతిస్తూ ఉండడం చేత –అని భావం. వింటితో అదలించి, లేపినా నిద్రలేవని నిద్రలో అభినివేశాన్ని పొంది ఉన్నావు. **"నిన్ ఈరడి......మజ్గైయర్ ఇరువరుమ్.....అడి వరుడ"** అని అనడంచేత పురుషకారం లేనందువల్ల నేను నా ఫలాన్ని పొందలేదనే అవకాశం లేదు. అని, **"అఱితుయిల్ అమర్న్దనై"** అని అనడంచేత "నీవు నన్ను గూర్చి చింతించక పోవడంచేత నా ఫలాన్ని పొందలేదనే అవకాశం లేదు" అనే భావాలను వ్యక్తం చేశారు.

**నెఱిముఱై నాల్ వకై వరుణముమాయినై**
**మేదకు మైమ్పొరుమ్ పూతముమ్ నీయే**
**అఱుపద మురలుమ్ కూన్దల్ కారణమ్**



**ఏళ్విడై యడజ్గ చ్చెఱ్ఱనై–అఱువకై**
**చ్చమయము మఱివరు నిలైయినై–ఐమ్బా**
**లోదియ ఆకత్తిరుత్తినై –అఱమ్ముదల్**
**నాన్గవైయాయ్ మూర్త్తి మూన్ఱాయ్**
**ఇరువకై ప్పయనా యొన్ఱాయ్ విరిన్దు**
**నిన్ఱనై–**

**ప్రతి:–** నెఱి ముఱై=శాస్త్రమర్యాదను అనుసరించి ఉన్న, నాల్ వకై వరుణముమ్ ఆయినై =నాల్గు వర్ణాల మర్యాదకు నిర్వాహకుడవై ఉన్నావు, మేదకుమ్ ఐమ్బొరుమ్ పూతముమ్ నీయే=ఆత్మలు పొందికగా ఉండతగిన పంచమహాభూతాలకుకూడా ప్రవర్తకుడవై ఉన్నావు, అఱు పదమ్ మురలుమ్ కూన్దల్ కారణమ్=తుమ్మెదలు (మధువును ఆస్వాదించడం కోసం వచ్చి, నిబిడంగా ఉండి ఝుంకారాలు చేస్తూ ఉన్న తుమ్మెదలు చేరిన కేశాలనుకల నప్పిన్నైప్పిరాట్టి కోసం, ఏళ్ విడై=ఏడు ఎద్దుల, అడజ్గ శెఱ్ఱినై = బలిమిని అణిచావు, అఱు వకై శమయముమ్= బాహ్య కుదృష్టి మతస్థులచేత, అఱివు అరు=తెలిసికోవడానికి వీలుకాని, నిలైయినై=స్థితిని కల్గి ఉన్నావు, ఐమ్బాల్ ఓదియ=మార్దవం, శైత్యం, సౌగంధ్యం, నీలిమ, దైర్ఘ్యం–అనే – అయిదు లక్షణాలను కల కేశాలను కల్గి ఉన్న లక్ష్మీదేవిని, ఆకత్తు ఇరుత్తినై=వక్షఃస్థలంలో కల్గి ఉన్నావు, అఱమ్ ముదల్ నాన్గు = ధర్మాది చతుర్విధ పురుషార్థాలను ఇచ్చేవాడవై, మూన్ఱు మూర్త్తి ఆయ్=త్రిమూర్తి స్వరూపుడవై, ఇరు వకై పయన్ ఆయ్=సుఖదుఃఖాలనే రెండింటికి నిర్వాహకుడవై, ఒన్ఱు ఆయ్ విరిన్దు నిన్ఱనై=నీవు ఒక్కడవుగానే ఉన్నా, ప్రపంచం అంతా వ్యాపించి ఉన్నావు.

**పెరియ–ప్రథమ :– (నెఱిముఱై యిత్యాది) మున్బనుసన్ధిత్తపడియే రక్షిత్త రక్షణప్రకారమ్ శొల్లుకిఱదు. (నెఱి ముఱై) శాస్త్రమర్యాదై తప్పాదపడి. (నాల్వకై వరుణముమాయినై) చాతుర్వర్ణ్యముమ్ నీయిట్ట వళక్కు. ఆత్మాక్కళుక్కు వర్ణజ్గళై క్కొడుత్తుమ్, అవర్కళుడైయ అనుష్ఠానత్తుక్కు ఆరాధ్యనాయిరుప్పాను మవనిఱే. "అహం హి సర్వయజ్ఞానాం కర్తా భోక్తా" ఎన్ఱుమ్, "వర్ణాశ్రమాచారవతా పురుషేణ పరః పుమాన్, విష్ణు రారాధ్యతే పన్థా నాన్య స్తత్తోషకారకః" ఎన్ఱుమ్, "చాతుర్వర్ణ్యం మయా సృష్టమ్" ఎన్ఱుమ్ శొల్లక్కడవదిఱే. (మేదకు మైమ్పొరుమ్ పూదముమ్ నీయే) ఆత్మాక్కళుడైయ దేహారమ్భకజ్గళాన మహాభూతజ్గళుమ్ నీయే. (మేదకు) మేవి త్తక్కిరుక్కుమ్. మేవుకైయావతు–"దేవోఽ‌హమ్, మనుష్యోఽ‌హమ్" ఎన్గిఱపడియే పొరున్దియిరుక్కై. అదావదు– "యాదానుమోరాక్కై యిఱుప్పుక్కు" అజ్గే తక్కిరుక్కై. అదావదు– కర్మత్తుక్కనుకూలమాయిరుక్కై. ఇత్తాల్ సత్తాదికళ్ నీ యిట్ట వళక్కానపిన్బు ఉన్నైయొళియ రక్షకరుణ్డో? ఎన్గై.**

(అఱుపద మిత్యాది) సామాన్యరక్షణమ్ శొల్లి విశేషరక్షణమ్ శొల్లుకిఱదు. (అఱుపద మురలుమ్ కూన్దల్ కారణమ్) వణ్డుకళ్ తేనై ప్పరుకి మురలా నిన్ఱ తిరుక్కుఴలైయుడైయళాకైయాలే భోగ్యభూతైయాన నప్పినైప్పిరాట్టియిన్ పొరుట్టు. (ఏఴ్విడై యడఙ్గ చ్చెఱ్ఱనై) ఏఴెరుత్తైయుమ్ ఊనప్పడాతపడి నెరిత్తాయ్. ఇత్తాల్ "నప్పిన్నైప్పిరాట్టియుడైయ సంశ్లేషత్తుక్కు విరోధికళై ప్పోక్కినాప్పోలే ఎన్నుడైయ విరోధికళైయుమ్ పోక్కి త్తన్దరుళవేణుమ్" ఎన్ఱు కరుత్తు.

(అఱువకై చ్చమయముమ్ అఱివరునిలైయినై)– అనాశ్రితరాన బాహ్యరుడైయ నినైవుక్కు గోచరమల్లై.

(ఐమ్బాలోదియ ఆకత్తిరుత్తినై) ఐన్ఱు లక్షణముడైయ తిరుక్కుఴక్కఱ్ఱైయుడైయ పెరియపిరాట్టియారై త్తిరుమార్బిలే వైత్తాయ్, మేఱ్చొల్ల ప్పుకుకిఱ ఐశ్వర్యసౌందర్యఙ్గళుక్కు అడియాన శ్రియఃపతిత్వమ్ శొల్లప్పడుకిఱదు.

(అఱముదల్ నాన్గవైయాయ్) ధర్మాదిసకలపురుషార్థప్రదనుమాయ్. (మూర్త్తి మూన్ఱాయ్) బ్రహ్మరుద్రాదికళుక్కు నిర్వాహకనాయ్. (ఇరుప్పయనాయ్) సుఖదుః ఖఙ్గళిరణ్డుక్కుమ్ నిర్వాహకనాయ్. (ఒన్ఱాయ్ విరిన్దు నిన్ఱనై) సర్వముమ్ స్వప్రకారమాయిరుక్క చ్చెయ్దే అవఱ్ఱోడు ఒట్టఱ్ఱునిన్ఱాయ్. ఇత్తాల్–ఐశ్వర్యమ్ శొల్లిఱ్ఱు.

పెరియ ద్వితీయః– (నెఱి యిత్యాది) శాస్త్రమర్యాదై తప్పాదపడి ముఱైయిలే నడక్కిఱ నాలువకైపట్ట వర్ణఙ్గళుమ్ నీ యిట్టవఴక్కాయిరుక్కిఱదు. జగదారమ్భకమాన భూతపఞ్చకఙ్గళుమ్ నీ యిట్టవఴక్కు. సత్తాదికళుమ్ ఉన్నధీనమాన పిన్బు ఉన్నై యొఴియ రక్షకరుణ్డో? (అఱుపద మిత్యాది) ఆఱుకాలైయుడైత్తాయ్, మధుపానార్థమాక ప్పడిన్ద వణ్డుకళ్ మధుపాన మత్తమాయ్క్కొణ్డు, ఆళత్తివైయానిన్ఱ మయిర్ముడియైయుడైయ నప్పిన్నైప్పిరాట్టియోట్టై సంశ్లేషత్తుక్కు ప్రతిబన్ధకమాన ఋషభఙ్గళేఴైయుమ్ ఊట్టియాక నెరిత్తాయ్, ఎన్నుడైయ ప్రతిబన్ధకత్తైయుమ్ నీయే పోక్కవేణుమ్.

(అఱువకై యిత్యాది) ఆఱువకైప్పట్ట బాహ్యసమయఙ్గళాల్ అఱియవొణ్ణాద స్వభావత్తై యుడైయైయా యిరున్దాయ్. (ఐమ్బా లిత్యాది) అఞ్జు లక్షణత్తైయుడైత్తాన మయిర్ముడియై యుడైయళాయ్. "న కశ్చి న్నాపరాధ్యతి" ఎన్నుమ్ పెరియపిరాట్టియారై త్తిరుమార్విలే వైత్తరుళినాయ్. మేఱ్చొల్లప్పుకిఱ ఐశ్వర్యసౌలభ్యఙ్గళుక్కు నిబన్ధనమాన శ్రియః పతిత్వమ్ శొల్లిఱ్ఱు.

(అఱముత లిత్యాది) ధర్మార్థకామమోక్షఙ్గళాకిఱ పురుషార్థ చతుష్టయఙ్గళుమాయ్, బ్రహ్మరుద్రాదికళుక్కు నడువే స్వరూపేణ నిన్ఱు, అవర్కళై శరీరమాక కొణ్డు నిన్ఱు,



**"బ్రహ్మవిష్ణుశివాత్మికామ్, స సంజ్ఞాం యాతి భగవా నేక ఏవ జనార్దనః" ఎన్నలామ్బడి నిఱ్పానాయ్, సుఖదుఃఖఙ్గళుక్కు నియామకనాయ్, కారణావస్థైయిల్ సచ్ఛబ్దవాచ్యనాయ్, సృష్టికాలత్తిలే వన్దవాఱే "బహుస్యామ్" ఎన్గిఱపడియే విస్తృతనాయ్ నిఱ్కిఱాయుమ్ నీ.**

**అరు:– (వరుణముమాయినై) – వర్ణమాదల్, వరిక్కప్పడు కిఱవనాదల్. ఇవఱ్ఱై అరుళిచ్చెయ్కిఱార్ (ఆత్మాక్కళుక్కు) ఇత్యాది వాక్యద్వయత్తాలే. ఇరణ్డుక్కుమ్ ప్రమాణ మరుళిచ్చెయ్కిఱార్ (అహం హి ఇత్యాది). (అడఙ్గ)–(ఊనప్పడాదపడి) – కుఱైపడాదపడి. (ఐన్బులక్షణమ్) – మెన్మై, కుళిర్త్తి, నాఱ్ఱమ్, (ఐమ్బాలోదియ) నెడుమై, కఱుప్పు – ఆక ఐన్దు వకైప్పట్ట మయిర్ముడి.**

**పెరియ అను.** ః– ఇక, యోగనిద్రలో నుండి, చింతించిన రీతిలోనే రక్షించే ప్రకారాన్ని పలుకుతున్నారు. **(నెఱి ముఱై నాల్ వకై వరుణముమ్ ఆయినై)**– శాస్త్రమర్యాద తప్పకుండేటట్లు క్రమానుసారం ప్రవర్తించే, బ్రాహ్మణ–క్షత్రియ–వైశ్య–శూద్రులనే నాల్గు విధాలైన వర్ణాలుగా అవుతున్నావు. ఈ నాల్గు వర్ణాలుకూడా నీ అధీనం–అని భావం. ఆత్మలకు ఈ నాల్గు వర్ణాలను అనుగ్రహించినది నీవే అయినందువల్ల, వారి వర్ణాలకు తగిన అనుష్ఠానాలతో ఆరాధింపబడేవాడవు నీవే అయినందువల్ల "నాల్గు వర్ణాలు నీవే" అని చెప్పవచ్చునని తాత్పర్యం. **"అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభు రేవ చ"** (గీత–9–24) (నా ఆరాధనారూపాలైన అన్ని యజ్ఞాలను అనుభవించేవాడను నేనే. వాటికి ఫలాన్ని అనుగ్రహించేవాడను నేనే) అని, **"వర్ణాశ్రమాచారవతా పురుషేణ పరః పుమాన్, విష్ణు రారాధ్యతే పంథా నాన్య స్తత్తోషకారకః"** (వి.పు–3–8–9) (ఆయా వర్ణాశ్రమాచారాలకు తగిన ఆచారాన్నికల వ్యక్తిచేత పరమపురుషుడైన విష్ణువు ఆరాధింపబడుతున్నాడు. వేఱు ఏ రీతిలోను అతనికి సంతోషం కలుగదు) అని, **"చాతుర్వర్ణ్యం మయా సృష్టమ్"** (గీత–4–13) (నాల్గు వర్ణాలు నాచే సృష్టించబడ్డాయి) అని ఈ అర్థాలు శాస్త్రాలలో తెలుపబడ్డాయి కదా!

(ఈ సందర్భంలో **"వరుణము మాయినై"** అనే ప్రయోగానికి వరింపబడేవాడవు అవుతున్నావు–అనే అర్థాన్ని పెరియవాచ్చాన్ పిళ్ళై అనుగ్రహించారని అరుంబదకారుల వివరణం సరసంకాదు. **(నాల్ వకై వరుణమ్)** అని అంటూ ఆఴ్వార్లు విశేషించి పలుకడం ఈ అర్థంతో సమన్వయించదు. **"ఆత్మాక్కళుక్కు"** అని అంటూ ప్రారంభించినవాక్యాలలో పెరియవాచ్చాన్ పిళ్ళై, **"వరుణము మాయినై"** అనే సామానాధికరణ్యప్రయోగం, భగవానుడు వర్ణాలను సృష్టించడాన్ని, ఆ వర్ణధర్మాలతో ఆరాధింపబడేవాడైయుండడాన్ని కారణంగా కల్గి ఉన్నది అని చూపి, అందుకోసం తగిన ప్రమాణాన్ని చూపిస్తున్నారే తప్ప, **"వరిక్కప్పడుకిఱవన్"** అనే అర్థాన్ని అనుగ్రహించలేదని గ్రహించాలి అని శ్రీకృష్ణస్వామి అయ్యంగార్ వివరణం)

**(మేదకుమ్ ఐమ్బెరుమ్ పూతముమ్ నీయే)** ఆత్మలు ప్రవేశించి, పొందికగా ఉండే దేహానికి ఉపాదానం అయిన పృథివి, అప్, తేజస్సు, వాయువు, ఆకాశాలనే అయిదు భూతాలు నీవే. అంటే – అవి నీ అధీనంలో ఉన్నాయని భావం. **(మేదకు)** కోరి, ఆశ్రయించి ఉండడం, ప్రవేశించి పొందికగా ఉండడం. అంటే **"యాదాను మోరాక్కైయిల్ పుక్కు అఙ్గు ఆప్పుణ్డుమ్"** (తిరువిరు–95) అనే రీతిలో ఆత్మలు దేవాదిశరీరాల్లో ప్రవేశించి. **దేవోఽ హమ్, మనుష్యోఽ హమ్"** (నేను దేవుడనై ఉన్నాను, నేను మానవుడనై ఉన్నాను) అని అనుసంధించేటట్లు దానితో పొందికగా ఉండి వాటికివాటికి తగిన కర్మలను అనుష్ఠించడానికి తగిన యోగ్యతను పొంది ఉండడం. **"నాల్వకై వరుణముమ్ ఆయినై ఐమ్బెరుమ్ పూతముమ్ నీయే"** అని అంటూ "నా శరీరానికి, దాని స్వభావానికి సత్తాస్థితి ప్రవృత్తులు నీ అధీనాలైనపుడు నీవు తప్ప వేఱొకరక్షకులు ఉన్నారా? అనే అర్థాన్ని ఇక్కడ వ్యక్తం చేశారు.

యోగనిద్రలోనుండి చింతించిన రీతిలోనే చేసిన రక్షణలలో అందరికీ సమాన రక్షణం అయిన వర్ణభూత సృష్టి స్థితి మొదలైన వానిని ఇంతవరకు తెల్పి, స్వామికి అంతరంగ అయిన నప్పిన్నైప్పిరాట్టిని రక్షించిన ప్రకారం అయిన విశేషరక్షణాన్ని ప్రస్తావిస్తున్నారు. **(అఱు పద మురలుమ్ కూన్దల్ కారణమ్)** ఆఱు కాళ్ళను కల్గినవై, ఈమె కేశపాశంలో ప్రవహించే మధువును ఆస్వాదించడంకోసం వచ్చి, చేరి ఉన్న మధుకరాలు. మధువును ఆస్వాదించడంవల్ల మైకాన్ని పొంది, ఝంకారాన్ని చేసే కేశాలను కల్గినది కావడంవల్ల తనకు మిక్కిలి ప్రియమైన నప్పిన్నైకోసం. **(ఏఴ్ విడై అడఙ్గచ్చెఱ్ఱినై)**– ఆమెను కౌగలించుకోవడానికి అడ్డంగా ఉన్న ఏడు వృషభాలలో ఒక్కటిని కూడా వదలకుండా వాటి కంఠాలను మర్దించి, వధించావు. ఇందువల్ల "నప్పిన్నై ప్పిరాట్టిని పొందడానికి అడ్డుగా ఉన్నవాటిని తొలగించినట్లే, నీవు నన్ను పొందడానికి అడ్డుగా ఉన్న పాపాలను పోగొట్టాలి." అనే అర్థాన్ని వ్యక్తీకరించారు.

**(అరు వకై శమయముమ్ అతి వరు నిలైయినై)**– నిన్ను అంగీకరించని చార్వాక, బౌద్ధ, జైన, నైయాయిక, వైశేషిక (తార్కిక), పాశుపతులనే ఆఱు మతాలవారిచే గ్రహించడానికి వీలుకాని స్వభావాన్ని కల్గినవాడవై ఉన్నావు. ఇందువల్ల "నిన్ను ఆశ్రయించనివారికి అందరానివాడవై ఉండే నీవు, నిన్ను ఆశ్రయించినవారికికూడా అందకుండా ఉంటావా? అనే హార్దభావాన్ని తెలిపారు.

**(ఐమ్బాలోదియై ఆకత్తిరుత్తినై)**–స్త్రీల కేశపాశానికి ఉండవలసిన లక్షణాలు అయిన ఉంగరాలు తిరిగి ఉండడం, నేయి పూసినట్లు మెఱవడం, సౌగంధ్యాన్ని కల్గి ఉండడం, నిబిడంగా ఉండడం, మెత్తగా ఉండడం – అనే అయిదు లక్షణాలనుకల కేశపాశాన్ని కల్గిన లక్ష్మీదేవిని వక్షఃస్థలంలో ధరించి ఉన్నావు. ఈ అయిదు కేశలక్షణాలను వేఱువిధంగా



కూడా కొందఱు చెబుతారు. **(ఆకత్తు ఇరుత్తినై)–"పాపానాం వా శుభానాం వా వధార్హాణాం ప్లవఙ్గమ, కార్యం కరుణ మార్యేణ న కశ్చి న్నాపరాధ్యతి"** (రామా. యు–116–44) (వానరా! పాపులైనా, పుణ్యశాలులైనా, చంపదగినవారైతే వారి విషయంలో సత్పురుషుడు కరుణను చూపించాలి. ఈ లోకంలో తప్పు చేయనివాడెవడు లేడు) అని అంటూ హనుమంతునకు ఉపదేశించి లక్ష్మిని ఎల్లప్పుడు భక్తులకోసం పురుషకారాన్ని చేసేటట్లు వక్షఃస్థలంలో ధరించి ఉన్నావు. **"మఙ్గైయ రిరువరుమ్ వరుడ"** అనే సందర్భంలో శ్రీభూదేవులను ఇద్దఱిని పురుషకారంగా అనుసంధించినా, వక్షః స్థలంలోనే ఉండే లక్ష్మీదేవియొక్క ప్రాధాన్యం ఇక్కడ చెప్పబడుతున్నందున పునరుక్తి దోషంలేదు. లేక, పైన చెప్పబోయే ఐశ్వర్య (పరత్వ) సౌలభ్యాలు, సౌందర్యం ఇతనికి ఈమె వలననే కల్గినవి అని తెలుపడం కోసంకూడా చెప్పబడుతున్నదని గ్రహించవచ్చు.

వాటిలో మొదట ఐశ్వర్యం చెప్పబడుతున్నది. **(అఱమ్ ముదల్నాన్గవైయాయ్)**– ధర్మార్థకామమోక్షాలనబడే నాల్గు పురుషార్థాలుగా అవుతున్నావు. **"చతుర్ణాం పురుషార్థానాం దాతా దేవః చతుర్భుజః"** (చతుర్భుజుడైన నారాయణుడు నాల్గు పురుషార్థాలను అనుగ్రహించేవాడు) ఇత్యాదిగా చెప్పబడడంచేత నాల్గు పురుషార్థాలను అనుగ్రహించేవాడు ఇతడే కాబట్టి, లక్షణయా "నాల్గు పురుషార్థాలు ఇతడే" అని అంటున్నారు. **(మూర్త్తి మూన్ఱాయ్)**– బ్రహ్మరుద్రేంద్రులనబడే మూర్తిత్రయానికి అంతర్యామియై – అని భావం. లేక, బ్రహ్మ–విష్ణు–రుద్రులనే త్రిమూర్తులను చెప్పినట్లయితే బ్రహ్మరుద్రులకు నడుమ చెప్పబడే విష్ణువుగా తానే నిలచి రక్షణకార్యాన్ని చేసేవాడై, బ్రహ్మరుద్రులకు అంతర్యామియై ఉండి, తనకు శరీరభూతులైన వారిద్వారా సృష్టి–సంహార–కార్యాలను చేసే తీరు చెప్పబడుతున్నది. **"సృష్టిస్థిత్యంతకరణీం బ్రహ్మవిష్ణుశివాత్మికామ్, స సంజ్ఞాం యాతి భగవాన్ ఏక ఏవ జనార్దనః"** (వి.పు–1–2–66) (సృష్టి, రక్షణం, సంహారం అనే మూడు వ్యాపారాలను చేయడంకోసం బ్రహ్మ, విష్ణు, శివులనే మూడు పేర్లను (ఆ పేర్లను కల రూపాలను) జనార్దనుడొక్కడే పొందుతున్నాడు) అని శ్రీపరాశరమహర్షి వచించారు కదా! **(ఇరు వకై ప్పయనాయ్)**–సుఖదుఃఖాలనే ద్వివిధకర్మఫలాలకు నిర్వాహకుడై– అని భావం. **(ఒన్ఱాయ్ విరిన్దు నిన్ఱనై)** ప్రళయకాలంలో లోకంలో ఉన్న వస్తువులు అన్నీ నామరూపవిభాగాన్ని కోల్పోయి తనతో కలసి ఉండడంచేత **"సదేవ"** (ఛా.దో–6–2–1) అని శ్రుతి తెల్పిన రీతిలో నీవొక్కడుగా ఉన్నవాడవై, సృష్టికాలంలో **"బహుస్యామ్"**(ఛాందో–6–2–3) (నేను అనేకంగా కాగలను) అని సంకల్పించిన తరువాత నామరూపవిభాగాన్ని పొందిన పలు వస్తువులుగా విస్తరిస్తున్నావు. ఈ రీతిలో సృష్టి ప్రళయకాలాలను చెప్పకుండా, అన్ని కాలాల్లోను అన్ని వస్తువులు తనకు ప్రకారాలుగా ఉండడంచేత "చేతనాచేతనాలను శరీరంగాకల శ్రియఃపతి ఒక్కడే తత్త్వమ్" అనేటట్లున్న

వాడై, ఈ విధంగా వాటిని శరీరంగా కల్గి ఉన్నా, వాటి దోషాలు ఏవీ తనలో సంక్రమించ కుండా ఉన్నవాడై, విలక్షణుడై ఉన్నాడని చెప్పినట్లుకూడ గ్రహించవచ్చు. **"అఱుముదల్"** అని ప్రారంభించి ఇంతవరకు భగవానుని ఐశ్వర్యం (పరత్వం) చెప్పబడింది. ఇందువల్ల "నా ప్రాప్యాన్ని నాకు సాధించి ఇవ్వగల ఐశ్వర్యం నీకు లేక పోవడంచేత నేను కోల్పోయాననే అవకాశం లేదు" అనే అర్థాన్ని వ్యక్తీకరించారు.

**కున్దా మదు మలర్ చ్చోలై**
**వణ్కొడి ప్పడప్పై- వరు పునల్ పొన్ని**
**మామణి యలైక్కుమ్-శెన్నెల్లొణ్ కழని**
**త్తికழ்వన మదుత్త-కఱ్పోర్ పురిశై**
**కనక మాళిగై-నిమిర్కొడి విశుమ్బిల్**
**ఇళమ్పెఱై తువక్కుమ్-శెల్వమ్ మల్కు తెన్**
**తిరుక్కుడన్దై-అన్దణర్ మన్దిర మొழியుడన్**
**వణఙ్గ- ఆడరవమళియి లఱితుయిల్**
**అమర్న్ద పరమ-నిన్నడియిణై పణివన్**
**వరుమిడరకల మాற்றோ వినైయే**

ప్రతి :- కున్దా మదు=ఏనాడు తగ్గని (నిండుగా ఉన్న) తేనెను కల, మలర్ శోలై=పూలతో నిండిన తోటలను కల్గినది, వణ్ కొడి పడప్పై=తామర ఆకుతోటలను కల్గినది, వరు పునల్ =ఎప్పుడూ ప్రవహించే తీర్థాన్నికల, పొన్ని=కావేరీనది, మా మణి=గొప్పరత్నాలను, అలైక్కుమ్=కొట్టుకొనివచ్చే, శెన్నెల్ ఒణ్ కழని=ఎఱ్ఱని ధాన్యాలపంటతో అందమైన క్షేత్రాలను కల్గినది, తికழ் వనమ్ ఉదుత్త=ప్రకాశించే వనాలను నాల్గు దిక్కులలో కల్గినది, కఱ్పోర్ పురిశెయ్=విద్వాంసుల నగరంగా చెప్పబడేది, కనకమ్ మాళికై నిమిర్=బంగారు మయం అయిన మాళిగలనుండి ఊర్ధ్వముఖంగా ఎగిరే, కొడి=ధ్వజాలు, విశుమ్బిల్ = ఆకాశంలో ఉండే, ఇళ పిఱై=బాలచంద్రుణ్ణి, తువక్కుమ్=స్పృశించే, శెల్వమ్ మల్కు = సంపదను నిండుగా కల్గిన, తెన్ తిరు కుడన్దై=దక్షిణదేశంలోని కుంభఘోణ క్షేత్రంలో, అన్దణర్=బ్రాహ్మణులు, మన్దిరమ్ మొழியుడన్=వేదమంత్రాలను పల్కుతూ నమస్కరించేటట్లు, ఆడు అరవు అమళిల్=పడగలను విప్పి ఆడే ఆదిశేషుడనే శయనంపై, అఱి తుయిల్ అమర్న్ద=యోగనిద్రను పొందడంలో ఆసక్తుడవైన, పరమ=సర్వేశ్వరా!, వరుమ్ ఇడర్ అకల=ఈ సంసారంలో సంభవించే దుఃఖాలు పోవడంకోసం, నిన్ అడి ఇణై పణివన్ = (ఓ-ఆర్తి అతిశయాన్ని సూచిస్తుంది) నీ పాదద్వంద్వాన్ని ఆశ్రయిస్తున్నాను, వినై మాற்று=సంసారదుఃఖాన్ని తీర్చు.



పెరియ-ప్రథమ :- (కున్దా మదు మలర్) ఎన్ఱు మేలుక్కు నీర్మై క్కొల్లైయాన విడత్తిలే శరణమ్ పుకుకిఱార్. (కున్దా మదు మలర్చ్చోలై) కున్దాద మధువెళ్ళత్తైయుడైత్తాన పూఙ్గోలై. ఆరావముదాழ்వారుడైయ కటాక్షమాకిఱ అముద వెళ్ళత్తాలే వళరుకిఱ శోలైయాకై యాలే నిత్యవసంతమాయ్ చ్చెల్లుకిఱదు. (వణ్ కొడిప్పడప్పై) అழకియ కొడిక్కాల్కళైయుమ్, నీర్నిలత్తైయుముడైయ. (వరుపునల్ పొన్ని మామణి యలైక్కుమ్ శెన్నెల్లొణ్ కழని త్తికழ்వనముదుత్త) పెరుకి వారానిన్ఱ తిరుప్పొన్ని మహార్ఘమాన రత్నఙ్గళై క్కొழித్తేఱవరుకిఱ, ఇత్తాల్ విళైకిఱ. శెన్నెలైయు ముడైత్తాకైయాలే అழకియ కழనియైయుముడైత్తాయ్, విళఙ్గానిన్ఱ అழకియ వనఙ్గళాలుమ్ శూழப్పట్ట. (కఱ్పోర్ పురిశై) విద్వాన్గళ్ పడుకాడు కిడక్కుమ్ నగరి. (కనకమాళికై) పొన్నాలే శెయ్యప్పట్ట మాళికై. (నిమిర్ కొడి విశుమ్బిల్ ఇళమ్ పిఱై తువక్కుమ్) అదిల్ నిమిరానిన్ఱుళ్ళ కొడికళ్ చన్ద్రనై చ్చెన్ఱు తువక్కుమ్. (శెల్వమ్మల్కు తెన్ తిరుక్కుడన్దై) నిరతిశయమాన సమ్పత్తైయుమ్, భోగ్యత్తైయైయుముడైయ తిరుక్కుడన్దైయిలే. (అన్దణర్ మన్దిర మొழியుడన్ వణఙ్గ) అనన్యప్రయోజనరాన బ్రాహ్మణర్ రహస్యమాన సూక్తఙ్గళై క్కొణ్డాశ్రయిక్క.

(ఆదరవమళియిల్ అఱితుయిలమర్న్ద పరమ) తన్నుడైయ స్పర్శత్తాలే విరిక్కప్పట్ట ఫణఙ్గళై యుడైయ తిరువనన్దాழ்వానాకిఱ పడుక్కైయిలే జగద్రక్షణత్తుక్కాక ఉణర్న్దుకొణ్డు కణ్వళర్న్దరుళకైయాలే సర్వేశ్వరనానవనే! (ఆదరవు) తిరువనన్దాழ்వానుడైయ ఉచ్ఛ్వాసనిశ్వాసఙ్గళాలే తూఙ్గుతొట్టిలైప్పోలే యెన్నవుమామ్. (నిన్నడియిణై పణివన్ వరుమిడరకల మాற்றோ వినైయే) ఉన్నుడైయ తిరువడికళిలే శరణమ్ పుకున్దేన్, ఇత్తై యనుభవిక్కైక్కు విరోధియైప్పోక్కి యరుళవేణుమ్. ఇత్తాల్ ఇష్టప్రాప్తిక్కుమ్, అనిష్టనివారణత్తుక్కుమ్ సిద్ధమాన ఉపాయత్తై ప్పற்றி విడుకిఱార్.

పెరియ-ద్వితీయః- (కున్దా విత్యాది) కున్దాత మధువైయుమ్, మలరైయుయుడైత్తాన శోలైయైయుముడైత్తాయ్, అழకియ కొడికళైయుడైత్తాన తోట్టఙ్గళైయు ముడైత్తాయ్, మాఱాత జలసమృద్ధియై యుడైత్తాన పొన్ని పాయ్న్దు రత్నఙ్గళై క్కొழித்து ఏఱిడానిఱ్ఱుతాయ్, అழకియ శెన్నెలై యుడైత్తాన కழనికళైయుడైత్తాయ్, త్తికழானిన్ఱుళ్ళ వనత్తై చ్చుற்றிలే యుడైత్తాయ్ తొழில్ ఓరప్పడానిన్ఱుళ్ళ మదిళైయుముడైత్తాయ్, పొన్నాలే శెయ్యప్పట్ట మాళికైయిల్ నట్ట కొడికళానవై ఆకాశత్తిలే సఞ్చరిక్కిఱ చన్ద్రనై త్తువక్కినాలుమ్ శుற்றிడానిఱ్ఱుతాయ్ నిరవధికసమ్పత్తైయుమ్ భోగ్యత్తైయైయుముడైత్తాన తిరుక్కుడన్దైయిలే బ్రాహ్మణర్ వేదాన్త సూత్రఙ్గళై క్కొణ్డు ఆశ్రయిక్క, ఉన్నోట్టై స్పర్శత్తాలే వికసితమాన ఫణఙ్గళైయుడైయ తిరువనన్దాழ்వానాకిఱ పడుక్కైయిలే జగద్రక్షణత్తిలే అవహితనాయ్ క్కొణ్డు కణ్వళర్ న్దరుళుకిఱ సర్వాధికనే! (నిన్నడియిణై యిత్యాది) ఎన్నుడైయ స్వరూపాను

**రూపమాక దేవర్‌తిరువడికళిలే శరణమ్ పుకున్దేన్. నీయుమ్ ఉన్నుడైయ స్వరూపాను రూపమాక ఎన్నుడైయ సాంసారికవరుత్తత్తై క్కఴిత్తు త్తరవేణు మెన్గిఱార్.**

**అరు :- (వణ్‌కొడి) - వెఱ్ఱిలైక్కొడి. "పడప్పై" - వెఱ్ఱిలైత్తోట్టమ్. నిమిర్‌కొడి - కొడికళ్ - ధ్వజఙ్గళ్. (మాఱ్ఱోవినైయే) ఎన్నై విట్టకలుమ్బడి మాఱ్ఱు (ఓర్ ఇడరకల అడియిణై పణివన్). ఎన్నై సంసారత్తిల్ నిన్ఱుమ్ మాఱ్ఱు ఎన్నవుమామ్.**

**తిరువెఴుకూఱ్ఱిరుక్కై వ్యాఖ్యానమ్ ముఱ్ఱిఱ్ఱు**
**పెరియవాచ్చాన్పిళ్ళై తిరువడికళే శరణమ్.**

పెరియ-అనుః- ఇక, **"కిడన్దవాఱు ఎఴున్దిరున్దు పేశు"** (తిరుచ్చంద-61) అనే రీతిలో భక్తులు నియమిస్తే ఆ రీతిలోనే చేసేవాడు కావడం వల్ల, సౌలభ్యానికి పర్యంతసీమ, అందానికి అద్వితీయమైన నెలవు అయిన ఆరావముదాఴ్వార్లను నమ్మాఴ్వార్లు శరణు పొందినట్లే, తిరుమఙ్గైయాఴ్వార్లు కూడా శరణాగతి చేస్తున్నారు. **(కున్ఱామదు మలర్ చ్చోలై)** కొఱత లేని మధుప్రవాహాన్ని, దాన్ని ప్రవహింపజేసే పూలనుకల తోటలను కల్గినదై-అని భావం. దోహదాన్ని, నీటిని పోసి పెంచిన తోటలు అయితే మధువును స్రవించే పూవులకు కొఱత ఉండవచ్చు. ఆరావముదాఴ్వార్ల కటాక్షం అనే అమృతప్రవాహంతో పెరిగే తోటలు కాబట్టి అక్కడ నిత్యవసంతమై ఉంటుంది. **(వణ్ కొడి ప్పడప్పై)**- అందమైన తమలపాకు తీగలను, లేక, జల ప్రదేశాలను కల్గినదై. **"పడప్పై"** అనే పదం పలు విధాలైన తీగలను కల తోటలను కాని, తమలపాకు తీగలనుకల జలప్రదేశాలను కాని సూచిస్తుంది. **"వణ్"** అన్నది నిబిడత్వాన్ని, దాని వల్ల కలిగే అందాన్ని చెబుతుంది. **(వరు పునల్ పొన్ని మా మణి అలైక్కుమ్)**- ప్రవహించి వచ్చే నీటి సమృద్ధినికల కావేరీనది విలువైన రత్నాలను కొట్టుకొని వచ్చి, **"చంచచ్చామరచంద్ర-చందనమహామాణిక్యముక్తోత్కరాన్ కావేరీ లహరీకరైః విదధతీ"** (రంగ.స్తవ-పూ-21) (ప్రకాశించే చామరాలు, పచ్చకర్పూరం, చందనం, విలువైన రత్నాలు, ముత్యాలు-అనే వాని గుంపులను అలలు అనే చేతులతో గ్రహించి స్వాగతించే కావేరీనది), **"ఆళరియాల్ అలైప్పుణ్డయానై యాప్పుమ్ అకిలుమ్ అణిముత్తుమ్ వెణ్ శామరైయోడు పొన్ని మలైప్పణ్డమ్ మణ్డత్తిరై యున్దు"** (పెరియ తిరు-3-8-3) (వీర సింహాలచే సంహరింపబడిన ఏనుగుల దంతాలను, అగరు చెట్లను, అందమైన ముత్యాలను, తెల్లని చామరాలను, పర్వతాలలో దొరికే ఇంకా పలు వస్తువులను అన్నిటినీ కొట్టుకొని ప్రవహించి వచ్చే కావేరి), **"శన్దిరనోడు మణియుమ్ కొఴిక్కుమ్ పునల్ కావిరి"** (పెరియ తిరు-5-4-1) (చందనపు కట్టెలతో పాటు మణులను కొట్టుకొని వచ్చే నీటిని కల కావేరి), **"వేయిన్ ముత్తుమ్ మణియుమ్ కొణర్న్దు ఆర్ పునఱ్కావిరి"** (పెరియ తిరు-5-4-9) (వెదుళ్ళలోని ముత్యాలను, మణులను కొట్టుకొని వచ్చే నీటిని కల



కావేరి), **"తిశైవిల్ వీశుమ్ శెఴుమామణికళ్ శేరుమ్ తిరుక్కుడన్దై"** (తిరువాయ్-5-8-9) (దిక్కులలో తేజస్సును ప్రసరింపజేసే, విరివిరిగా ఉండే గొప్ప రత్నాలు చేరే తిరుక్కుడన్దై క్షేత్రం) అనే రీతిలో గొప్ప రత్నాలను కావేరీనది తన కెఱటాలనే హస్తాలతో తీసికొనివచ్చి చేరుస్తున్నట్లు చెప్పబడిందికదా! **(శెన్నెల్ ఒణ్ కఴని)** ఈ కావేరి వల్ల బలిసి, పెరుగుతున్న ఎఱ్ఱని ధాన్యాన్ని కల్గి ఉండడంచేత అందంగా ఉండే తోటలను కల్గినదై. **(తికఴ్ వనమ్ ఉడుత్త)** నీటిసమృద్ధిచేత నిబిడంగా పెరిగి, ప్రకాశించే వనాలతో చుట్టబడి ఉన్నదై. **(కఱ్పోర్ పురిశై)**- **"తిశైవిల్ వీశుమ్ శెఴు మామణికళ్"** (తిరువాయ్-5-8-9) అనే ప్రయోగంలో తెలుపబడ్డ, ఎనిమిది దిక్కులలో వ్యాపించిన కీర్తినికల తిరుమఴిశై ఆఴ్వార్ల వంటి జ్ఞానాధికులు నిత్యవాసాన్ని చేసే నగరమై-అని భావం. **"పురిశై"** అన్నది నగరాన్ని చెబుతుంది. **"పురిశెయ్"** అనే పాఠాన్ని గ్రహించి, **"పురి"** (నగరి)గా చేయబడినదై అని దీపికావ్యాఖ్యలో అర్థం చూపబడింది, లేక **"పురిశై"** అంటే **"మదిళ్"** (కోట) అనే అర్థం చెప్పి, **"కఱ్ఱు ఓర్ పురిశై"** అనే ప్రయోగానికి "చక్కని నిర్మాణచాతుర్యాన్నికల కోటలను కల్గినదై" అనే అర్థాన్ని గ్రహించవచ్చు. **(కనకమాళిగై)** బంగారంతో నిర్మింపబడ్డ మాళిగలలో. **(నిమిర్ కొడి విశుమ్బిల్ ఇళమ్ పిఱై తువక్కుమ్)** నాటబడి, ఉన్నతంగా ఉండే ధ్వజాలు ఆకాశంలోని చంద్రమండలాన్ని తమ వస్త్రాలతో స్పృశిస్తున్నాయి. ఇది మాళిగల ఔన్నత్యాన్ని తెలిపే అతిశయోక్తి. **"తువక్కుమ్"** అనడంద్వారా ధ్వజపటం అయిన త్వక్కు (చర్మం)తో చుట్టూ స్పృశించడం తెలుపబడింది అని, అడ్డుపెట్టబడడం చెప్పబడిందని రెండు విధాలుగా అర్థాలను చెప్పవచ్చు. **(శెల్వమ్ మల్కు తెన్ తిరుక్కుడన్దై)** మిక్కిలి గొప్ప సంపదను, మాధుర్యాన్నికల కుంభఘోణంలో. **"శెల్వమ్ మల్కు"** అని ఐశ్వర్యాతిశయం, **"తెన్"** అని మాధుర్యం చెప్పబడ్డాయి. **(అన్దణర్ మన్దిర మొఴియుడన్ వణఙ్గ)** నిన్నే ప్రాప్యంగా గ్రహించినవారై, వేదవిదులైన బ్రాహ్మణులు **"మంత్రం యత్నేన గోపయేత్"** (మంత్రాన్ని ప్రయత్నపూర్వకంగా మఱుగుపఱచాలి) అనే రీతిలో అధికారులు కానివారి చెవిలో పడకుండేటట్లు రహస్యంగా ఆదరంతో రక్షింపబడేవాని వేదాంత సూక్తులతో ఆశ్రయించగా, (పెరియవాచ్చాన్ పిళ్ళై అనుగ్రహించిన రెండవవ్యాఖ్యానం ప్రాచీనప్రతిలో **"వేదాన్తసూత్రఙ్గళై క్కొణ్డు"** అనే అశుద్ధపాఠం ఉన్నది) **(ఆడరవమళియిల్ అఱితుయిల్ అమర్న్ద పరమ)** భగవానుని తిరుమేని స్పర్శంచేత విస్తరించిన పడగలనుకల ఆదిశేషుడనే పడుకలో లోకరక్షణను గూర్చి చింతిస్తూ కన్నులు మూసికోవడంవల్ల "నీవే సర్వేశ్వరుడవు" అన్నది వ్యక్తం అయేటట్లున్నవాడా! **(ఆడరవు)** పడగలను ఎత్తి ఆడే సర్పం, ఆదిశేషుడు ఊపిరిని లోపలకు పీల్చి, మరల బయటకు విడవడంవల్ల "అటు ఇటు ఊగిసలాడే ఉయలవలె ఉన్న ఆదిశేషుడు" అనే అర్థాన్ని కూడా గ్రహించవచ్చు.

**(నిన్ అడియిణై పణివన్)**-నీ శ్రీపాదాల్లో శరణాగతిని చేశాను. నీవే చేయి విడచినా నన్ను విడువని నీ శ్రీపాదాలనే ఉపాయంగా నిశ్చయించుకున్నానని భావం. **(వరుమ్**

**ఇడర్ అకల)** –నీ శ్రీపాదాలను, స్వరూపరూపగుణాలను అనుభవించడానికి అడ్డుగా ఈ లోకంలో ఎదురయ్యే విరోధులు తొలగిపోయేటట్లు. **(మాఱ్ఱో వినైయే)** సంసారసంబంధమనే మహాపాపాన్ని పోగొట్టి అనుగ్రహించాలి. **(అడియిణై పణివన్.....మాఱ్ఱో వినై)**– దాసుడనైన నేను నా స్వరూపానురూపంగా నిన్ను ఉపాయంగా ఆశ్రయించాను. నీవుకూడా నీ స్వరూపానుగుణంగా నా సంసారసంబంధంచేత ఏర్పడే దుఃఖాన్ని పోగొట్టి నీ శ్రీపాదాలను అనుగ్రహించాలి–అని **"తనియేన్ ఇని ఉన్ శరణమ్ తన్దు ఎన్ శన్మమ్ కళైయాయే"** (తిరువాయ్–5–8–7) (ఇక నేను సహించలేను. నీ చరణాలను శరణంగా అనుగ్రహించి నా జన్మలను పోగొట్టు) అన్న నమ్మాఴ్వార్లవలె అనిష్టనివృత్తికి, ఇష్టప్రాప్తికి సిద్ధోపాయమైన శ్రియపతినే ఆశ్రయించారు.

**తిరుమఴైయాఴ్వార్ తిరువడిగళే శరణమ్**
**తిరువెఴుకూఱ్ఱిరుక్కై – దివ్యార్థదీపిక**
**అనువాదం సమాప్తం**

**కమ్బర్ ఇయఱ్ఱియ శాఱ్ఱు ప్పాడల్**
(కంబకవి రచించిన సమాపన పాశురము)

**ఇడఙ్గొణ్డ నెఞ్జత్తిణఙ్గి క్కిడప్పన ఎన్ఱుమ్ పొన్ని**
**త్తడఙ్గొణ్డ తామరై శూఴుమ్ మలర్న్ద తణ్పూఙ్కుడన్దై**
**విడఙ్గొణ్డ వెణ్పల్ కరున్దుత్తి శెఙ్కణ్ తఴలుమిఴ్ వాయ్**
**పడఙ్గొణ్డ పామ్బణై ప్పళ్ళికొణ్డాన్ తిరుప్పాదఙ్గళే.**

పొన్ని= కావేరిచేతను, తామరై కొణ్డ తడమ్ = తామరపూలను కల సరస్సుచేతను, శూఴుమ్= చుట్టబడియున్నదై, మలర్న్ద = వికసించియుండు, తణ్= చల్లని, పూ= పూవులు నిండినదగు, కుడన్దై = కుంభఘోణములో, విడమ్ కొణ్డ = విషాన్నికల, వెణ్ పల్= తెల్లని దంతాలను, కరుమ్ తుత్తి = నల్లని గుర్తులను, శెమ్ కణ్= ఎఱ్ఱని కన్నులను, తఴల్ ఉమిఴ్ వాయ్ = అగ్నిని ఉమిసే నోళ్ళనుకల, పడమ్ కొణ్డ పామ్బు అణై= పడగలను ఎత్తి ఆడే ఆదిశేషుడనే పడకమీద, పళ్ళికొణ్డాన్= శయనించి ఉండే ఆరావముదాఴ్వార్ యొక్క, తిరు పాదఙ్గళే = అందమైన శ్రీ పాదాలే, ఇడమ్ కొణ్డ= విశాలం అయిన చోటుకల, నెఞ్జత్తు = (తిరుమఴై ఆఴ్వార్ యొక్క) మనస్సులో, ఇణఙ్గి క్కిడప్పన= ఎల్లప్పుడు పొందికగా ఉన్నాయి.

కంబకవి పాశురంగా చెప్పబడే ఈ పాశురం తిరువెఴు కూఱ్ఱిరుక్కై అనే ప్రబంధం చివరలో అనుసంధింప బడుతున్నది, తిరుమఴై ఆఴ్వార్ల గొప్పతనాన్ని కంబమహాకవి ఇందులో స్తుతిస్తున్నారు.



**(పొన్ని తామరై కొణ్డ తడమ్ శూఴుమ్)**–కావేరీ నదిచేతను, తామరలను కల కొలనులచేతను చుట్టబడినదై, **(తణ్ పూఙ్కుడన్దై)**– చల్లని పూలు నిండిన తిరుక్కుడన్దైలో అని భావం. ఇక **"పళ్ళికొణ్డాన్"** అనే పదంలో అన్వయించి అర్థం చెప్పాలి. ఏ పడుకలో పరుండి ఉన్నాడు అన్నది ఇక వివరింపబడుతున్నది. **(విడఙ్గొణ్డ....పామ్బణై)** అని అంటూ. **(విడమ్ కొణ్డ వెణ్ పల్)** అసురులను, రాక్షసులను కఱవడంకోసం విషం నిండిన దంతాలను కలవాడై, **(శెమ్ కణ్)**– అస్థానే భయశంకచేత ఎల్లప్పుడూ ఎఱ్ఱగా ఉండే తిరునేత్రాలను కలవాడై, **(తఴల్ ఉమిఴ్ వాయ్)**, **"ఆఙ్గారవారమ్ అదు కేట్టు అఴల్ ఉమిఴుమ్ పూఙ్గార్ అరవణై"** (నాన్ముకమ్.తిరు–10), అనే రీతిలో అస్థానే భయశంకవల్ల నిప్పును ఉమిసే నోళ్ళను కలవాడై, **(పడమ్ కొణ్డ పామ్బణై ప్పళ్ళికొణ్డాన్)– "ఆదరవు అమళియిల్ అతి తుయిల్ అమర్న్ద పరమ"** అని అంటూ తిరుమఴైమన్నన్ ఈ ప్రబంధంలో పల్కినట్లే పడగలను ఎత్తి ఆడే అనంతుడనే పడుకమీద పరుండి ఉండే ఆరావముదాఴ్వార్‌యొక్క అని భావం. **"వెణ్ పల్"** అని ప్రారంభించి ఇంతవరకు ఆదిశేషుని పళ్ళ తెల్లనిదనం, గుర్తుల నల్లదనం, కన్నుల ఎఱ్ఱదనం, నోటిలో నుండి ఉమిసే అగ్నివర్ణం, పడగల తెలుపు, ఆరావముదాఴ్వార్ తిరుమేని నైల్యం– ఇవన్నీ కలిసినందువల్ల ఏర్పడిన పరభాగశోభను అనుసంధిస్తున్నారు. **(తిరుప్పాద ఙ్గళే)**–అందమైన శ్రీ పాదాలే, **(ఇడమ్ కొణ్డ నెఞ్జత్తు ఎన్ఱుమ్ ఇణఙ్గి క్కిడప్పన్)–"వెళ్ళత్తాన్ వేఙ్గడత్తానేలుమ్ కలికన్ఱి ఉళ్ళత్తినుళ్ళే ఉళన్"**– (పెరియ తిరు–11–5–10) అని అంటూ తిరుమఴైయాఴ్వార్లే అనుగ్రహించిన రీతిలో క్షీరాబ్ధి, వేంకటాచలాలకంటే విశాలం అయిన చోటును కల్గినదిగా భగవానునిచేతనే అభిమానింపబడే తిరుమఴైయాఴ్వార్ల హృదయంలోని ఒక భాగంలో ఎల్లప్పుడూ పొందికగా ఉంటాయి **"విశ్వస్యాయతనం మహత్"** (నారాయణము) (సర్వేశ్వరుని పెద్ద కోవెలగానున్నది దాసుల హృదయం)–అని, **"నెఞ్జమే నీళ్‌నకరాక ఇరున్ద ఎన్ తఞ్జనే"** (తిరువాయ్–3–8–2) అని ఉభయవేదాలలో దాసుల మనస్సు పెద్ద కోవెలగా, విశాలనగరంగా చెప్పబడిందికదా !



# అనుబంధం-1

("మాఱన్ అలంకారమ్" అనే తమిళ అలంకారగ్రంథంలో
నిర్వచించబడ్డ "ఎఢుకూఱ్ఱిరుక్కై" లక్షణం)

(1) ఒన్డు ముదలా ఓఴ్ ఏఴ్ ఈఱా
చ్చెన్ఱ ఎణ్ ఈరేఴ్ నిలన్దొఱుమ్ తిరితర
ఎణ్ణువదు ఒన్ఱామ్ ఎఢుకూఱ్ఱిరుక్కై.

(2) అవైతామ్,
ఇరద పెన్దత్తినిల్ ఇడై అఱై ఇరణ్డాయ్
చ్చురదమదు ఉఱ నడై శార్ తరు పాన్మైయిన్
ఒన్డు పన్నాన్గాయ్ ఒరు పన్నిరణ్డాయ్
నిన్డు అయల్ ఏనవుమ్ నిలన్దొఱుమ్ ఉపయమ్.
కున్డువదాయ్ త్తొగై కూడి ఒన్టిల్ ఇఱుమ్

(3) ఇరట్టు మొఴిదలోడు ఈఱు తిరిన్దు ఎణ్
తిరట్టవుమ్ పెఱూ ఉమ్ తెరియుఞ్జాలై



# అనుబంధం-2

## రథబంధ చిత్రము

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | 1 | 2 | 1 | | | | | |
| | | | | 1 | 2 | 3 | 2 | 1 | | | | |
| | | | 1 | 2 | 3 | 4 | 3 | 2 | 1 | | | |
| | | 1 | 2 | 3 | 4 | 5 | 4 | 3 | 2 | 1 | | |
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 5 | 4 | 3 | 2 | 1 | |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 6 | 5 | 4 | 3 | 2 | 1 |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 6 | 5 | 4 | 3 | 2 | 1 |

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 6 | 5 | 4 | 3 | 2 | 1 |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 6 | 5 | 4 | 3 | 2 | 1 |
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 5 | 4 | 3 | 2 | 1 | |
| | | 1 | 2 | 3 | 4 | 5 | 4 | 3 | 2 | 1 | | |
| | | | 1 | 2 | 3 | 4 | 3 | 2 | 1 | | | |
| | | | | 1 | 2 | 3 | 2 | 1 | | | | |
| | | | | | 1 | 2 | 1 | | | | | |